## విషయసూచిక.





రూపలావణ్యములఁ జాల నేవు గాంచి
మురిపెములఁ దీర్చు మోహనమూర్తు లనఁగ
గర్భమునఁ బుట్టి గిట్టిన యర్భకులకు
కృతి యొసంగితి నారిసద్గతులకొఱకు.

# కవిహృదయము



మాతృభాషాభ్యాసంగ మొనరించు ప్రౌఢవిద్యార్థిబృందమున కుత్తమగ్రంథపఠన మవశ్యాచరణీయము. విద్యార్థులు విశ్వసామ్రాజ్యపీఠ మలంకరించు మణులవంటివా రగుట నుత్తమోత్కృష్టశూన్యము లగు గ్రంథములను వా రధ్యయనము సేయరాదు. సద్గ్రంథములలో దివ్య మగు నాత్మ యున్నది. దానివలననే యవి యనశ్వరము లగుచుఁ దమ్మాశ్రయించుపాఠకుల కతుప్రానందము నొసఁగుచున్నవి. కావుననే

"పురాణ మితిహాసం చ తథాఖ్యానాని యాని చ
మహాత్మనాం చ చరితం శ్రోతవ్యం నిత్య మేవ చ"

అని యార్యులు శాసించియుండిరి.

ఉత్తమజీవితపఠనము నిస్తేజము నిర్జీవము నగు మానవహృదయమునకు సంపూర్ణవికాసము నొసఁగుచున్నది.

ముఖ్యముఁ గర్తవ్యోన్ముఖు లగు కవీంద్రులకవితలు హతాశు లగు చదువరులను నూతనాశాపూరితులం జేసి వారిహృదయాంతరాళముల ధైర్యసాహసములఁ బురికొల్పుచుండును.

కాళిదాసకవీంద్రుని కవితావిలాసములు, భర్తృహరికవిసార్వభౌముని రచనాపటిమ, భవభూతికవిశేఖరుని వాఙ్మాధుర్యము, ఆంధ్రకవితాపితామహుని యల్లికజిగిబిగి, పాండు

రంగవిభుని పదగుంఫనము, ముక్కుతిమ్మనార్యుని ముద్దుపలుకు, కవిత్రయమువారి రసోచితశయ్య, పోతనకవిమూర్ధాభిషిక్తుని భక్తిరసపూరితకవిత్వసంపదయు నెట్టివాని నేని విజ్ఞానసంపన్నుని గాఁ జేయక మానవు.

మఱియు, చాణక్యుని నీతిమాణిక్యములు, బుద్ధుని బోధసుధ, జీసను ప్రబోధము, మహమ్మదు దివ్యోపదేశములు విద్యార్థుల హృదయసీమల సంస్కరించి జ్ఞానబీజముల వెలయింపక పోవు. అట్లగుట నుత్తమజీవితములఁ బఠించు విద్యార్థులు మహోదారచరిత్రు లగుటయే కాక తమ భావిసంతానమునకు మార్గదర్శకులు గూడ నయ్యెదరు. ఇప్పట్టున,

> "సత్ప్రవర్తనము గల మనుజులు తమ
> ఘనమునకు శిలాస్థాపనములు"

అను ఎమర్సన్ పండితుని హితబోధ స్మృతిపథమున నిలుపక తీరదు. "దేశచరిత్రము దృష్టాంతపూర్వకముగ బోధించు తత్త్వశాస్త్రము వంటిది." అనియు "దేశచరిత్రము జీవిత ప్రకాశమనియు" చెవి నిల్లుగట్టుకొని పోరిన మహనీయుల వాక్యములయం దెంతేని సత్యము గలదు.

ప్రకృత మీ గ్రంథమున నుల్లేఖింపఁబడిన పురుషోత్తముల యుత్తమజీవితము లద్భుతరసావహములు, నుత్తమాదర్శములు నగుట విద్యార్థిలోకమునకు 'దొడ్డి పెట్టిన వేల్పుగిడ్డి' వంటి దని వచియించుట మిథ్యాకల్పనము కానేరదు. వెండియు,

"ఉదయే సవితారక్తో రక్త శ్చాస్తమనే తథా,
సంపత్తౌ చ విపత్తౌ చ మహతా మేకరూపతా."

అనురీతిని ధీమంతులచందములు గాన నీరీతి లోకాదర్శములగు ననునీతి సర్వతోముఖముగ వ్యక్తము కావలయు నను నుద్దేశముతో నీపొత్తము రచియింపఁబడినది.

క. ఎఱుక గలవారి చరితలు
కఱచుచు, సజ్జనులగోష్ఠిఁ గదలక, దుర్గం
బెఱుగుచు, నెఱిఁగినదానిని
మఱవ కనుష్ఠించునది సమంజసబుద్ధిన్.

అను భారతనీతి నేమఱక భాషావ్యాసంగమున వాఙ్మయస్వరూపమును గుర్తెఱింగి యాప్తార్థములఁ బడసి యశశ్చంద్రికలఁ వెదజల్లెదరు గాక యని కాంక్షించుచున్నాఁడను.

ఈగ్రంథము నాటిపండితుల మేటియాదరణమునఁ నేఁటివిద్యార్థుల కుపకరించు నని విశ్వసించుచున్నాఁడను.

ఇట్లు,
బుధజనవిధేయుఁడు
గ్రంథకర్త



# ఉత్తమజీవితములు

## ప్రహ్లాదుఁడు

శ్రీమదాంధ్ర భాగవతనిర్మాణచాతురీధురీణుఁ డగు బమ్మెర పోతనామాత్యుని భక్తిసముద్రమునుండి కవితాభావ తరంగవిజృంభణము కతంబున. బయల్వెడలిన దివ్యతేజోమణియై దైత్యాటవీసంజాతహరిచందనమై సత్పురుషలోకమార్గాభిషిక్తుఁడై యాసేతుశీతనగవాస్తవ్యులహృద్వీథులనిండి వెలుఁగొందు భక్తజనశేఖరుఁడు ప్రహ్లాదుఁడు. దానవకుల శిరోమణి యగు హిరణ్యకశిపునకు సుగుణలలామయు సాధ్వీమతల్లియు నగు లీలావతియందు జనియించిన పుత్రరత్నము. ముముక్షువుల పాదపూజ లందుచు ముల్లోకముల సంచరించు పరమభాగవతోత్తముఁడు మునికులసార్వభౌముఁడు నగు నారదమునీంద్రుని ప్రియశిష్యుఁడు. చరాచరజంతువర్గమునందును దనయందును సమహితత్వమును గాంక్షించువాఁడు. పెద్దలఁ గాంచి సేవకునిలీలఁ దద్దయు వినతు లొనరించువాఁడు. అన్యకాంతామతల్లుల నవలోకించినంతనే మాతృభావన చేసి మన్నించువాఁడు. దీనజనప్రకరమును గాంచి ధర్మవాత్సల్యమున జననీజనకుల చాడ్పునఁ బోషింపఁ దలపోయువాఁడు. సఖులయెడ గురుజనంబులయెడ సోదరభావమును దైవతభావ

మును జూపుచు హాస్యలీలావిలాసముల నైన బొంకి యెఱుఁగని నిష్కళంక ప్రభావిభాసితుఁడు. మఱియు నాకారజ న్మవిద్యార్థ వరీయుఁడై నను గర్వసంగతుఁడు కాఁడు. వివిధమహానేకవిషయ సంపన్నుఁడై నను బంచేంద్రియములకు లోఁబడనివాఁడు. భవ్య వయోబలప్రాభవసమన్వితుఁడై నను కామరోషాదులఁ గ్రందు కొనఁడు. కామినీప్రముఖభోగములఁ దులతూఁగుచున్నను వ్యసనసంసక్తి లేని ధీరుఁడు. ఇట్టి చిత్రచరిత్రములతోఁ గూడిన యీభక్తజనపారిజాతుని కథాసంవిధానము భారతసంతాన మునకు మార్గదర్శకమై పరిఢవిల్లుఁ గాక!

ప్రహ్లాదుని పినతండ్రి యగు హిరణ్యాక్షుని మరణము నకుఁ గారణభూతుఁ డగు శ్రీమహావిష్ణువును సాధింప నమ కట్టి తండ్రి హిరణ్యకశిపుఁడు తపం బొనర్ప మందరాచలము నకుఁ బోయె. తల్లి యింద్రునిచేఁ జెఱపట్టఁబడి దేవమౌని కటాక్షవీక్షణమున విడివడి నాథురాకను మదిలో వాంఛిం చుచు మనోవాక్కాయముల దోషరహితయై మౌనిశుశ్రూ షలు సేయుచు కాలము గడపుచుండె. అత్తఱి జగదుద్ధారక మగు తారకమంత్రరాజమును గర్భకుహరముననే యభ్యసించి భూమి కవతరించిన మహాభాగుఁ డీ ప్రహ్లాదుఁడు.

తపోలబ్ధికై మందరాద్రి కరిగిన దైత్యరాజు వద్ధ గర్భునిఁ గూర్చి యుగ్రతపము చేయ నారంభించె. అతని తపః ప్రభవానలజ్వాలలకుఁ దాళఁ జాలక సురగణము లెల్లఁ గమ లాసను నాశ్రయించి తద్వృత్తాంతమును విన్నవించుకొనిరి.

అంధుల కానలు మొగంబుల వేల్పు సపరివారముగ దానవ భర్తకుఁ బ్రత్యక్షమై యభీప్సితముల ననుగ్రహించె. హంస వాహనుని యనుగ్రహంబు కతంబున నమోఘవరంబుల నంది దితినందనుఁడు గర్వాతిరేకమున గంధర్వయూథమును గజిబిజి రొనర్చె. సురల నసురునుకు గావించె. యక్షకిన్నర కింపురు షుల బలిమిమై బాధింపఁ జొచ్చె. యాగము లొనరించు భూ భాగములకుఁ జేరి హవిర్భాగములఁ దానె స్వీకరింప మొద లిడె. తుదకు సునాసీరునిఁ బదభ్రష్టుని గావించి సుధర్మామధ్య పీఠము నాక్రమించె. ఇట్లు దిగ్విజయమును జేకొని యాతఁడు పుత్రసందర్శనోత్సాహము రెట్టింప స్వగృహాభిముఖుఁ డయ్యె.

బంగరుపానుపునఁ బవ్వళించి కేశవనామసంస్మరణ మొనరించు తనూజాతు నుపలక్షించి దనుజాధినాథుఁ డాగ్రహావ్యగ్రుఁడై కర ముద్దీపించె. శత్రునామసంకీర్తనము చేయు బాలకునిఁ జక్కఁజేయ సర్వవిధములఁ బ్రయత్నించి విఫల మనోరథుఁ డయ్యె. కన్నకుమారుని గరువతనమునకు హృదయ మెఱియసాగె. "అక్కటా! శత్రుదుర్నిరీక్ష ప్రతాపుండ నగు నా సన్నిధానమున, నరాతిమత్తేభకుంభస్థలవిదారణాంకుశ మగు నా కరవాలముముందర నెంతటి యద్భుతచరిత్రము లుద్భవించిన" వని వితర్కింప మొకలిడె. ఇట్లు పెద్దయుం బ్రొద్దు చింతించి కానిమ్ము చూచెదం గాక యని కుమారునిఁ జేరఁ జీరి సాంత్వనవచనముల "వత్సా! ఐహికాముష్మికసుఖం బులకు విద్యయే దివ్యసాధనము. చదువనివాఁ డజ్ఞుం డగు;

సకలసద్వివేకచతురుండవై విరాజిల్లుటకు విద్యానిధివి గమ్ము. వైళంబ గురుకులవాసముగావింపు" మని హెచ్చరించి ప్రచండవితర్కు లగు చండామర్కుల రావించి వారలం గాంచి యివ్విధంబున వాక్రుచ్చె. "సుధీవరులారా! వీఁడె నా కుమారుఁడు. విద్యాగంధశూన్యుఁడై యంధప్రక్రియ నున్నవాఁడు. మదీయప్రతాపోజ్జ్వలజ్వలనం బించుకయేని యెఱుంగఁడు. వీనిని గారుణ్యామృతచిత్తమున గ్రంథపరిచితునిఁ గావించి నీతివిశారదునిగా దిద్దుఁడు. మీరు మాకు గురువులు, పెద్దలు, ఆప్తబంధువులు, కారుణ్యచిత్తులు. వీనిని శిక్షించి రక్షింప మీరె సమర్థులు. వేయేల? మీదె భారము" ఇట్లు వచియించి కుమారుని వారి కొప్పగించెను.

చరాచరభూతవర్గమున నాత్మసామ్యము గాంచువానిని, దీనవత్సలుని, పరకాంతాపరాఙ్ముఖుని, పంచేంద్రియాతీతుని, కామరోషవివర్జితుని, సుగుణగణవిరాజితుని, బ్రహ్లాదుని వెంట నిడుకొని గురువులు స్వగృహాభిముఖు లైరి. పిమ్మట తరుణవయస్కు లగు నసురకుమారుల సహపాఠకులఁ జేసి పాఠయోగ్యము లగు శాస్త్రరాజములఁ బఠింపింప సాగిరి. పంచాబ్దంబులవాఁ డగు నబ్బాలుఁడు గుర్వవిధేయుఁడు గాక చెప్పిన దెల్ల మచ్చికమీఱ గ్రహించుచు నాత్మబుద్ధియై మెలంగసాగె. కాని విశేషశేముషీప్రభావసంపన్నుం డగుటచే గురుప్రబోధము మిథ్యాస్వరూప మని గ్రహించి నిరంతరము శ్రీమన్నారాయణచరణసేవాధురీణుఁడగుచు మెలఁగుచుండె.

కతిపయదినములు గడచుదనుక నిరీక్షించి దనుజాధి నాథుఁ డొక్కదివసమునఁ గుమారవిద్యాపరిశ్రాంతిని దిల కింపఁ గోరి యబ్బాలకుని జీరఁ బనిచె. కేశవచింతనామృత రసంబు నాస్వాదించుచుఁ గాలక్షేపము చేయు నక్కుమార వరుండు పితృశాసనము పాలించుచు దానవభర్తను సమీ పించె. ఇట్లరుదెంచిన పుత్రరత్నముం గాంచి మించిన ప్రేమానుబంధమునఁ గౌఁగిలించి దీవించి నేమ మారసి యంక పీఠమున నధివసింపఁజేసె. మఱియుఁ బుత్రగాత్రపరిష్వంగ మున రోమాంచితగాత్రుఁడై "వత్సా! నీ హృద్వీథిని భద్రం బగు విషయం బెయ్యది ముద్దులొలుకఁ బలుకవే" యని వాక్రుచ్చె. అందుల కాయర్భకుఁడు నిర్భరానందసంభరితుఁ డై "నిశాచరాగ్రణీ! మతిభ్రమణంబున సంసారాంధువునఁ బరిభ్రమింపక 'మీరు మే' మను భిన్నత్వమును వీడి దివ్య కళాధాముం డగు విష్ణుదేవుని శరణంబు సొచ్చుటయే మే" లని వచించె. ఇట్లు వచియించు ప్రహ్లాదుని గాంచి "తండ్రీ! నీవర్తనము గడుఁ జిత్రముగఁ దోఁచుచున్నది. దానవశ్రేణికిఁ గృతాపరాధుఁ డగు వైరివీరుని గొనియాడుట భావ్యమే? వత్సా! సురాధినాథుల స్రుక్కించుటయో, యక్షకిన్నర గంధర్వనాగపతుల నుక్కడంచుటయో, కావించి వంశపావనుఁ డవు గమ్ము. హరి యని గిరి యని వదరుచు వృథాకాలక్షేపము గావించి మోహాంధుఁడవై నశియింపకు" మని నిలింపవైరి మందలించె. హరిభక్తివిదూరుం డగు తండ్రిమాటలు విని

పురోహితుని దిక్కు మొగంబై ప్రహ్లాదుఁ డిట్లు రణించి చెప్ప దొరకొనె. "బ్రాహ్మణోత్తమా ! ఆయసము నయస్కాంతము వలె నాచిత్తమును హృషీకేశుపాదారవిందయుగళి సమాకర్షించుచున్నది. కొందఱజ్ఞులు వ్యక్తిభేదము గల్పించుకొని జిజ్ఞాసాపథమున మూఢులై పరంధాముని దర్శింప నేరరు. నిర్మలమై, గంభీరమై, మధురసుధారససంభరిత మగు దివ్యతేజోవికాసమున వెలుఁగొందు చిద్రూపుని గళ్యాణసాగరుని గాంచి తనివినొందిన డెందము బక్కదైవముల నాశ్రయించి తృప్తిఁ జెంద నేర్చునే!" ఇవ్విధంబున ముచ్చటించు దైత్యార్భకుని గాంచి సురారాతి రోషకషాయితాత్ముఁడై విజృంభింపఁ దొడఁగె. భీకరమూర్తి యగు నాతనిని శాంతుం జేసి గురువులు వెండియు సద్దండముగ దండించి యీతని జక్కఁ జేయుదు మని చెప్పి బాలకుని దోడ్కొని పోయిరి.

అనంతరము వారా రాక్షసరాజనందనుని సామదానభేదదండములఁ జక్కంబఱచి త్రివర్గపాఠవిధానము నేమర కుండు మని పలుమాఱు హెచ్చరించుచు దానవేశ్వరుని సన్నిధానమునకుఁ గ్రమ్మఱఁ దోకొనిపోయి "రాజా ! నీతిపారగుఁడైన కుమారకుని విద్యాప్రాభవమును బరీక్షింపవే" యని మనవి యొనర్చుకొనిరి. హరిహరాదుల కందఁగారాని భక్తిప్రాభవమునఁ జెన్నారువాని, మాధవానుచింతనమున మేను మఱచువాని, సర్వప్రపంచము శ్రీవిష్ణుమయము మని భావించువాని, కారుణ్యవివేకాదిలక్షణములు మూర్తిభవించిన ట్లమరువాని,

నిజనందనుఁ గాంచి జనకుండు హర్షోత్కర్షమునఁ జేరఁదీసి శిరము మూర్కొని "వత్సా! విద్యావైదుష్యము చూపవే" యని వేఁడుకొనియె. అంత నబ్బాలకుఁడు భీతచేతస్కుఁడు గాక నిరంకుశాధికారమున వర్తించు తండ్రియంతరమును బరాధీన వృత్తి నున్న తనయంతరమును బాటించియు నిట్లు వచియించె. "జనకా! గురువుల యనుగ్రహంబు కతంబున సకలార్థశాస్త్రపర మార్థమును విద్యారహస్యమును గ్రహించితి. తనువ్యాద్యామల నఖ్యము గలిగి శ్రవణమూలమున దాసత్వమును, వందనార్చనా విధానము నలవఱిచికొని సేవారతి నాత్మవిజ్ఞానముం బడసి సంకీర్తనపారవశ్యమున సర్వాత్మకుం డగు హరిపాదము లాశ్రయించి మనుట శ్రేయోదాయకము. హరిభక్తివర్జితుల సంసారములు నిస్సారములు. జీవితము లజ్ఞానజలాఖాతములు. ఉప్పితములు జుగుప్సాకరములు. కమలాక్షుని బూజించు కర ములు, శ్రీనాథు వర్ణించు జిహ్వ, సురరక్షకుని గాంచు దృక్కులు, శేషశాయికి మ్రొక్కు శిరము, భగవానుని వల గొను పదములు, ధన్యతమములు. కమలేశు నర్చింపని యిం ద్రియములు వ్యర్థములు. సంసారజీమూతవ్రాతమును, తాప త్రయాఖిలదావాగ్నియు, సర్వాంకపాఘౌఘజలరాసులును, ఘనవిపత్పరంపరాబంధురాంధకారమును గ్రమంబుగఁ జక్రి దాస్యప్రభంజనమున, విష్ణుసేవామృతవృష్టిమూలమున, హరి మనీషాబడబాగ్నికతంబున, పద్మాక్షునుతిరవిప్రభలచేతఁ గాని నశియింపఁజాలవు. కావున ధర్మార్థకామమోక్షతత్పరుఁడవై

విష్ణుసేవామృతమత్తచిత్తమున వర్తించి తరియింపు” మని యున్నకుండె. బాపురే! బాలకుని హృదయఫలక మెంత పరిశుద్ధముగఁ బ్రకాశించుచున్నది! వాక్కు లెంతకోమలములు! భావ మెంత గంభీరము!

అంత నాసురాంతకవైరి దుర్దాంతక్రోధఘూర్ణమానమానసుఁడై కంపింపఁ దొడఁగె. చిత్తమున్మత్తలపాటున స్వాయత్తము గాకుండె. ఇందులకు గురువుల యవివేకమే కారణ మని మండిపడుచుండె. బాలకునికి దుర్నీతులు గఱపి కొంపకుఁ జిచ్చువెట్టినవాఁ గుగురుబ్రువు లని నిందింపఁ బూనె. ప్రహ్లాదుఁడు పుత్త్రాకారమున దేహమున వ్యాపించిన మహావ్యాధి యని తలంచి వలవింపఁ దొడంగె. తుదకు వంశనాశనహేతుభూతమగు నీబాలభూతమును మననీయరా దని కృతనిశ్చయుఁడై సేనానిని బిలిచి “శౌరీ! వీనిని సత్వరముగఁ దోడ్కొని పోయి బాలుఁ డనక, రాచబిడ్డఁ డనక, కృపాసింధుఁ డనక, లోకమాన్యసంశీలుఁ డనక, నిరపరాధి యనక భిండివాల ముద్గర గదాభీలఘాతములచే నొప్పించి తుత్తునియలుగ మేను ఖండించి మడియఁ జేయు” మని యాన తిచ్చె.

అక్కటకటా! బాలుని, హరిభక్తిప్రభావిశాలుని, సుగుణాలవాలుని, సుందరాకారుని, లోకపవిత్రచారిత్రుని సంహరింప జనకుఁడే కృతనిశ్చయుఁ డయ్యె! భళిరే! రాజసతామసాహంకారములదుర్వృత్తి! దురహంకారదుర్విదగ్ధహృదయుఁ డగు రాక్షసకులపాంసనునకు హరిభక్తితత్పరుఁ

డగుకతనఁ గులాలంకారుఁ డగు కుమారమణి గర్భశత్రుఁ డయ్యె!

పిమ్మట రాజశాసనపరిపాలకు లగు పెక్కండ్రు వెడఁగు రక్కసు లుక్కు మిగిలి వివిధాయుధఘాతములఁ బలుతెఱంగుల నొప్పించియు నబ్బాలుని మడియింపఁ జాలక నివ్వెఱపడ సాగిరి. రాజశాసనములు, కఠినశిక్షలు, నిశ్చలదీక్షావరుల బాధింప నేర్చునే! దానిం గాంచి రాక్షసేంద్రుఁడు కట్టించిన కట్టలుకచేఁ గటవదంబు లదర నుగ్రుఁడై మత్తేభేంద్రయూథపాదములఁ ద్రొక్కించియు భీకరవిషోరగదంష్ట్రలఁ జొప్పించియు దారుణకృపాణజాలంబుల నమరించినబోనుల వినరించియు, భీకరోత్తుంగతరంగసింధుజలంబుల ముంచియు, ఘాతుకమృగశరణ్యంబు లగు ధరాధరకుహరంబులఁ ద్రోయించియు, విషప్రయోగముం జేయించియు నిట్లు బహువిధచిత్రవధోపాయంబుల నించుకేని యపాయ మొనరింగని యాత్మడింభకునిం గాంచి యసురేంద్రుండు విషణ్ణచిత్తమున నుత్తల మందఁ జొచ్చె. ఆహా! అజగదేకభక్తుని భక్తిప్రభావ మెంత యనిర్వచనీయము!

ఇట్లు ప్రహ్లాదకుమారుఁడు నిశాచరాధములు తన్నవియింప బాధ నొందఁడు. దిక్కులకుం బాఱఁడు. ఆత్మబంధులఁ జీరఁడు. ఘోరకృత్య మని తండ్రిని దూఱఁడు. కన్నకడుపగుటచేఁ గలవరించుతల్లి నైనఁ బిలువఁడు. కన్నుల నీరు దేఁడు. సునిశ్చలభక్తియోగమున నోదనుజభంజన! యోజగదీశ!

రామా నుమాపన్నశరణ్య! యని వారినామసంకీర్తన మొనరిం చునే కాని క్లేశమున కోహటింపఁడు. అట్టి పరమభక్తుని దివ్య ప్రభావమునకు వెఱఁగంది దనుజేశ్వరుఁడు వానికి ధర్మార్థ కామము లుపదేశింపుఁ డని గురుకుమారుల కానతిచ్చి పంచె. వారును మహాప్రసాద మని వానిం గొనిపోయి శక్తివంచనము సేయక బోధింపసాగిరి.

జ్ఞానసింధు వగు నబ్బాలుఁడు గురూపదిష్టశాస్త్రముల యందు భ్రమఁ జెందక యతీతుఁడై సతీర్థబృందమునకుఁ బరమభాగవతధర్మము లుపదేశించి వారల నెల్ల నారాయణ చరణారవిందసేవాపరాయణులఁ గావింప నుద్యోగించుచుండె. అబ్బాలకుని యపారవిజ్ఞానమునకుఁ దోడివిద్యార్థు లబ్బుర మందుచుఁ బరమభాగవతధర్మముల నుపన్యసించు ప్రహ్లాదుని విలోకించి యిట్లు లనిరి. "గుణాఢ్యుఁడా! మన మెల్లరము గురు కులవాసమున భార్గవకుమారులయొద్ద ననేకశాస్త్రసంప్రదాయములను వినుచుంటిమి. వేఱొక సద్గురుఁడు కానరాఁడు. రాజభవనప్రవేశ మన్నన్ ముక్కంటికి నైన సాధ్యపడదు. నీ వన్ననో యెన్నఁడును వెలికిఁ జని యెఱుంగవు. ఏమహా దాచార్యుఁడు నీ కీవింతమతిప్రకాశమున కేక్రియఁ దోడ్ప డియెనో వివరింపుము. ఇంతటినుండియు మాస్వాంతముల యందు నిన్నే సేవింతుము. రాజ వని భావింతుము. బహు మానములఁ గావింతుము." ఇత్తెఱంగునఁ దన్నుఁ బరిపరివిధ ములఁ బ్రస్తుతించు దైత్యనందనులకు భాగవతకులాలంకారుఁ

డైన ప్రహ్లాదకుమారుండు పూర్వవృత్తాంతమును సాంతముగ విన్నవించి నారదమంత్రోపదేశక్రమంబును వివరించి నాపలుకులు విశ్వసింతురేని యత్తపసిమతమే యిహపరసాధనం బని వారలకు బోధించె. ఈమోసమును గుర్తెఱింగి గురుప్రవరులు తత్తఱపాటుతో హిరణ్యకశిపుని సమీపించి జోతలిడి భూతలమునం బడి "దైతేయవంశాగ్రణీ! నీతనూజాతుఁడు రక్షోబాలురనెల్ల నొక్కచోఁ జేర్చి మాశిక్షామార్గము లెల్లఁ గల్లలని యాక్షేపించి వారలచిత్తంబుల మోక్షాయత్తములం జేసి మోసము వాటిల్లఁ జేసినాఁడు. అంతటినుండియు మతిమంతులగు మాయంతేవాసు లెల్లగు నుల్లముల సూబోధనముల నొల్లక సల్లలితప్రభావంబులగు విష్ణుగాథలఁ జెప్పనేరని కుహనాగురువు లని మమ్ముల్లంఘించుచున్నారు. మధురిపుకథనము వీడని యీబుడుతని మీదటత్వమున నెట్లు శిక్షింతురో మే మెఱుంగ నేర"మని యేతద్విషయమును సాలంకషముగ విన్నవించి పనివినియెద మాని వెడలిపోయిరి.

అంత గురుకుమారులు వినిపించిన యభియోగమును సాదరంబున విని యాదనుజేంద్రుఁడు దండతాడితదందశూకంబుపడువున రోఁజుచు భీషణరోషకషాయితేక్షణంబుల వీక్షించుచు, నిజపుత్రసంహరణోద్యోగమున కుద్యోగించుచుఁ దనూజాతుని రప్పించి క్రోధఘూర్ణితమానసుఁడై "ఓరోరీ! పుత్రహతకా! మదీయగర్భజలధిబడబానలా! కేశవనామాంధకారబంధురాటవీవీతిహోత్రుఁడ నగు నాయెదుటనా నీ

వైష్ణవప్రవృత్తి సాఁగనేర్చుట! ఇంద్రాదిదిక్పాలకులు నాయందు బద్ధద్వేషు లయ్యు మదీయాజ్ఞాభంగము సేయ నోడుదురు. మాటిమాటికిని గృతాపరాధుఁడగు వైకుంఠునిఁ బ్రశంసించు నుత్కంఠచేఁ గంఠశోషను జెంద నేమిటికి? కుత్తా! వైకుంఠుఁడు నీ వన్నయట్లు వీరవ్రతదీక్షాధురంధరుం డేని నే నమరవీరుల దండించి ఖండించునాఁడు ఘోరాహవక్షోణికి రాక కుంఠీభూతుఁడు గానేల? ఓరీ దుర్మతీ! ఈ సమస్తభూతశ్రేణికి నేను గాక రాజు వేఱొకఁడెవ్వాఁడు కలఁడు? నేను మద్భ్రాతృహంతకుని గూర్చి సమస్తభూతధాత్రిని బలుమాఱు శోధించి విడిచితిని. మనవంశమునకు నాశకరుం డగు పరిపంథిచరిత్రమును వేవిధంబులఁ గీర్తించి వాని యశుగుణమ్ములను భృత్యుఁడు వోలె సిగ్గుమాలి యారాధింప నేల? వందివై పినతండ్రిని జంపినవానిని నందివై పొగడెదు పిఱికిపందవు. ఇయ్యవియే నాకడగొట్టుపలుకు లాలింపుము. మనుగడపై నాశ కలదేని చిత్తమున వానితలఁపు కలనైన నిలుపఁ గూడదు. ఓయీ పసికూనా! నీ వేల యిట్లు కనుగంది వసివాడెదవు? చతుర్విధాహారముల నారగించుచు వందిమాగధులు కైవారములు సలుపుచు వెంట రా సుందరమందయానలొసంగెడు నివాళులను స్వీకరించుచు స్వైరవిహారములు సలుపుచు వైరిసంహారము గావించి మీమాతకు వీరమాత యను పేరు సంపాదించి చిరకీర్తియుతుఁడవు గమ్ము బిడ్డా! పితృవాక్యమును బాలించి దొడ్డవాఁడవు గమ్మని భయనటు

ముల బోధించె. అందుల కా బాలకుఁ డినుమంతయు వెఱ-పందక భక్తిపారవశ్యమున మేను మఱచి చిందులాడుచుఁ దండ్రిని గాంచి.

మ. "కలఁ డంభోధిఁ గలండు గాలిఁ గలఁ డాకాశంబునం గుంభినిం
గలఁ డగ్నిన్ దిశలం బగళ్ల నిశలన్ ఖద్యోతచంద్రాత్మలన్
గలఁ డోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలింగవ్యక్తులం దంతటన్
గలఁ డీశుండు గలండు తండ్రి వెదకం గా నేల యీయాయెడన్ "

"జనకా! ఇట్టి పరంధాముని, జగత్పరిపూర్ణుని, లోక ప్రకాశుని గూర్చి యన్వేషింప నేల? వినిర్జితసమస్తలోకా ధీశుఁడవు. అరాతివీరభయంకరుఁడవు. అయిన నేమాయె? ఇంద్రియానీకమును జయింపనేరవు. మోహపాశముల నిన్ను నిబద్ధుఁ జేయు భీకరశత్రువు లార్వురు గలరు. వారిని నిర్జించు నాఁడు గదా మేటిమగం డను నన్వర్థాభిధానమునకుఁ బాత్రుండ వగుదువు. ఆత్మలక్షణములు గుర్తెఱిఁగి దేహాదుల యందు మమకారక్రోధములు వీడి ప్రకృతిగుణమ్ముల భేద మారసి జననమరణాదు లాత్మకుఁ గల వను మిథ్యాభావ ముడిగి గుణకర్మగణబద్ధుఁడవు గాక నిష్కామవృత్తిని హరిని భజియింపు" మని గంభీరముగఁ బలుకఁ దొడంగె.

ఇవ్విధంబున వచియించు పరమభాగవతాగ్రేసరుని గాంచి దోషాచరశేఖరుఁడు మండిపడుచుఁ గనుఁగెలంకులఁ గెంపు గదుర "ఓరిడింభకా! అవివేకివై మూర్ఖచిత్తమునఁ బ్రతిఘటించి నాతోఁ బ్రతిభాష లాడెదవు. విశ్వాత్మకుఁడు,

విశ్వంభరుఁ డని మాటిమాటికి నీపొగడ్తలందు నాకుక్షింభరుఁ డీసభాస్తంభమునఁ గలఁడే? వానిని నా కిద్యెడఁ బ్రత్యక్షము సేయ నేర్తువే?" యని యౌడుగఱచుచు హుంకరించె. మూర్తీభవించిన శుద్ధసత్త్వమో యన నొప్పు నబ్బాలుఁడు భీతిల్లక "విశ్వపతి విశ్వమయుఁడు విశ్వాత్మకుఁ డీసభాస్తంభాంతర్గతుఁ డగుటకు సందియమేమి? సర్వోపగతుండగు చక్రి యిందుఁ గలఁ డందు లేఁ డని సందియమందుట మందబుద్ధుల లక్షణము. చూడ వేడుక యగుడుఁ గానరా కుండునే" యని పల్కుచుండె. దానికా రక్కసిఱేఁ డుక్కుమిగిలి క్రోధోద్దీపితనేత్రుఁడై కరాళించి దిగ్గున గద్దియ డిగ్గి కరవాలము ఝళిపించుచు మహాసంరంభమున సభాస్తంభమును బ్రహరించె.

తత్క్షణమే యాస్తంభమునఁ బ్రళయాభీలసంరంభమున సటాచ్ఛటలు గంపింప దుర్నిరీక్ష్యప్రతాపోజ్జ్వల హర్యక్షమస్తకుండగు నృసింహదేవుఁ డావిర్భవించె. అజ్జారే! ఆనక్తంచరవీరుని యీప్సితంబు సిద్ధింపఁ జేయుటకై విచిత్రావతారమున శ్రీమహావిష్ణువును జడపదార్థమున సాక్షాత్కరింపఁ జేసిన ప్రహ్లాదుని భక్తిప్రభావ మెంత బలీయమైనది! కేసరియాకారమున దిశలు గంపింపఁ జేయు నవతారమూర్తిని గాంచి దనుజాధినేత తనకుఁ గాల మాసన్న మైనదని గ్రహించి వీరపురుషోచితమరణ మపేక్షించి యుత్తాలపాటున గద నెత్తుకొని మిత్తి నెదుర్కొనె. అట్లు పెద్దయుం బ్రొద్దు తన్ను డీకొని యాహవ మొనరించు రక్షోవీరుని

బంధించి యా నరహరి తనయూరుభాగమునఁ జేర్చి చక్రాది నిర్వక్రసాధనములఁ గాక కులిశధారాసదృశములగు నఖాగ్రంబుల నురఃకవాటమ్ము వ్రచ్చి రుధిరధారలు వర్షించుచుండ నాంత్రమాలికలఁ గంఠమాలికలుగా ధరియించి విజృంభింప సాగె. అత్తఱి ప్రభువిశ్వాసపరాయణులగు దైత్యవీరు లాయుధము లెత్తుకొని తత్తఱపాటుతో రణంబున కురవడింప నారక్కసిమూఁకలఁ జక్రి చక్రాదిసాధనములచే నుక్కడంచె. వైరివీరసంహారానంతరము భయంకరకరాళాస్యమున నుద్దీపించు నద్దేవదేవు నితరులు చూడ నోడి విభ్రాంతులై మూలమూలల డాఁగఁ జొచ్చిరి. సుర చారణ విద్యాధర గరుడోరగయక్ష సిద్ధగణములలో నొక్కఁడేని యయ్యుక్కంబము దేవరను డాయ నోడుచుండిరి. నరకంఠీరవదర్శనోత్కంఠు లయి మింటనుండి దేవగణంబు లెల్ల జయజయధ్వానములు సలుపుచుఁ జనుదెంచిరి. అట్లరుగుదెంచిన బ్రహ్మాది దేవతలు నృసింహదేవుని వేఱువేఱ స్తుతియించిరి.

కాని నృసింహదేవుని నెమ్మోము పూర్ణేందుసామ్యమును వీడి ప్రళయార్కబింబమును బురుడించుచుండె. ప్రసాదభాసురములగు చూడ్కులు శిఖిశిఖాకలాపముల ననుకరించుచుండె. మూర్తి దాల్చిన వీరరౌద్రాద్భుతరసవ్యతికరము కాని కృపారసస్ఫూర్తి కానరాకుండె. ఎందుఁ జూచిన భయదదంష్ట్రాంకురప్రభావిభానమే కాని దరహసితంబు చూపట్టదయ్యె. తొల్లి కామినీజనమనోహరమైన సుభగవిగ్రహము నేఁడు

భీకరఖరనఖరముఖవిరాజిత మైన నృసింహవిగ్రహమై భీషణా కారమున నుండుటం జేసి లచ్చియుఁ జేరవెఱచి పలికిన మాఱు పలుకక విభుఁ డలుగు నేమో యని యొదిఁగి నిలిచియుండె. ఆ ప్రళయభీకరమూ ర్తిని శాంతింపఁజేయ నొరుల కలవిగా కుంటచే వారిజసంభవుని పనుపునఁ బ్రహ్లాదుఁడే యందుల కియ్యకొనియె. భక్తులకు సాధింపరానికార్యము లుండునే? అంతట భాగవతశేఖరుఁ డయిన బాలకుఁడు కరకమలములు ముకుళించి మందగమనమున శ్రీహరిసన్నిధిం జేరి.

మ. "ఖరదంష్ట్రాభ్రుకుటీసటానఖయు నుగ్రధ్వానయున్ రక్తకే
సరయున్ దీర్ఘతరాంత్రమాలికయు భాస్వన్నేత్రయు నైన నీ
నరసింహాకృతిఁ జూచి నే వెఱవఁ బూర్ణక్రూరదుర్వారదు
ర్భరసంసారదవాగ్నికిన్ వెఱతు నీపాదాశ్రయుం జేయవే."

యని పలుతెఱంగులఁ బ్రార్థింపఁ దొడఁగె. అంత భక్తపరాధీనుఁ డగు నయ్యాశ్వరుం డబ్బాలకుని విలోకించి కరుణాయత్తచిత్తుండై సర్వమంగళప్రశస్తం బగు నిజహస్త మును వాని మస్తకమున నిడి,

శా. "సంతోషించితి నీచరిత్రమునకున్ సద్భద్రమౌఁ గాక నీ
యంతర్వాంఛితలాభ మెల్లఁ గరుణాయత్తుండనై యిచ్చెదం
జింతిం చెందఱు భక్తకాముఁడ నే సిద్ధంబు దుర్లోక్యుఁడన్
జంతుశ్రేణికి నన్ను జూచినఁ బునర్జన్మంబు లే దర్భకా."

అని యభయం బిడి భద్రం బయ్యెడుఁ గాక యని యాశీర్వదించి "వత్సా! నీకుం గల కామితార్థము లెవ్వి"

యని యడిగె. అందుల కానిష్కామహృదయుఁ డగు ప్రహ్లాదుఁడు నైష్కామ్యవరముఁ బడసి ప్రణవోచ్చారణ పూర్వకంబుగఁ బునప్రణామ మాచరించె. మఱియు నాలోకేశ్వరుని యెడఁ దనతండ్రి కావించినయపరాధంబుల సహించి తదీయపాపౌఘమును దూలించి యుత్తమగతిం గల్పించి యనుగ్రహింపు మని ప్రార్థించి కృతకృత్యుం డయ్యె. పిమ్మట నుత్తర వయఃకాలము లోకోత్తరముగ గడపి యీశ్వరాదేశమునఁ బునరావృత్తిరహిత మగుసాయుజ్యపదవి నధిష్ఠించె.

ప్రహ్లాదునివంటి పరమసాత్వికుని, నక్షీణసత్యదీక్షాపరుని, సహజసంవర్ధమాననిరంతరధ్యానపరాయణుని, నాత్మగౌరవాభిమానిని, పూతచారిత్రుని, నిష్కామవీరుని లక్ష్యముగాఁ జేసికొని తాదృశపవిత్రజీవితమును నిత్యవ్రతముగ నాచరించు మహనీయులచే భరతఖండము ధన్య మగుఁగాక! వీనిపరమాద్భుతదివ్యచారిత్రము నాదర్శముగా నిడుకొని వర్తించువిద్యార్థు లెంతటిపూతచారిత్రులు?



# కుచేలుఁడు

ప్రాచీనకాలమునుండియు భారతవర్షము మహాభక్తుల కాశ్రయమై చిరకీర్తి గాంచినది. ఈపుణ్యభూమిని దాదాపుగా నైదువేలసంవత్సరములకుఁ బూర్వ మొకమహాభక్తుఁ డుదయించె. అతనిపవిత్రమూర్తి భారతహృదయపీఠమున స్థిరవసతి నేర్పఱచుకొని నేఁటివఱకును దదీయసంతానముచే నారాధింపఁబడుచున్నది. అతనిదివ్యనామము భారతదేశచారిత్రమున సువర్ణశోభాకలితంబయి యువయువతీజనంబులకు మంత్రరాజమై విరాజిల్లుచున్నది.

ఆభక్తజనపాలుఁడు కుచేలుఁడు. ఇట్టిసుగుణాలవాలుని గడుపారఁ గాంచి తరించి మించిన పుణ్యదంపతులనామము లెంతధన్యములో! ఈతఁడు వైదికసంప్రదాయమునఁ బ్రవర్తించుబ్రాహ్మణకుటుంబమునకుఁ జెందినవాఁడు. వీనివిద్యార్థిజీవితము వారణాశీపురప్రాంతమున నున్న యవంతీనగరమునఁ బ్రదర్శింపఁ బడుటచే నీతనిజన్మస్థానము తత్సమీపస్థంబు గానోపు. అయినను సర్వజనహృదయసీమల వాస మొనరించు నీభూసురనాయకుని జన్మస్థలనిర్దేశవిమర్శనముతోఁ బాఠకులకుఁ బ్రసక్తి లేదు. అవంతీపురవాసి యగు సాందీపుఁ డీతని విద్యాగురువు. లోకోత్తరచారిత్రుఁ డగుకుచేలునిగురుకులవాసమునుగూర్చి నేర్చుకొనుట మనకు శ్రేయోదాయకము కానోపు.

సనాతనవిద్యాప్రతిష్ఠాపనలతో నీకాలపువిద్యార్థులకుఁ బరిచయముఁ గలిగించుట దుర్ఘటము. సౌందర్యరసానుభూతి యందుఁ దన్మయత్వము నొంది యాధ్యాత్మికతత్త్వమునఁ బ్రకృతిని లీనమొనరించుటయే యానాఁటివిద్యాభ్యాసమునకు ఫలము. అట్టి జ్ఞానచక్షువును వికసింపఁజేసినవాఁడే విద్యాగురువు. అట్టి జ్ఞానపరిపూర్ణుఁ డగు దేశికోత్తమునిపాదసేవ లభించుటయే మనకుచేలుని కాధ్యాత్మికజీవితమునకు మూలకందము. శుకపికశారికాగీతములచే శ్రుతిమనోహరముగ ధ్వనించునాశ్రమతరుచ్ఛాయల విశ్రమించి చింతనము చేయు శాంతినికేతనములే యానాఁటివిశ్వవిద్యాలయములు. విజ్ఞానసింధువున బుద్ధినౌకకుఁ గర్ణధారియై మోక్షపారమును జేర్చు నాజగద్గురు నాశ్రయించి తరించునంతేవాసిగణంబునకుఁ బరిమితి లేకుండె. చతుర్వేదములందును, మన్వాదిసకలధర్మశాస్త్రములందును, పదవాక్యప్రమాణాదివిద్యలయందును, ఆన్వీక్షక్యాదిరాజతంత్రములందును, చతుష్షష్టికళలయందును శిష్యుల నుత్తీర్ణులఁ గావించుటే నిరాడంబరులగు సద్గురువరేణ్యుల శుద్ధసంకల్పము. గురుశిష్యన్యాయమునఁ గాలము బుచ్చువారి యనురాగలతావిజృంభణమునకు మేర లేకుండె. ఆవిద్యాలయమందలి ఛాత్రగణమున కాగురుదంపతులే తల్లిదండ్రులు.

సహపాఠిగణంబున నొక్కని మోముచందురునందుఁ గుచేలునిలోచనచకోరద్వంద మాహ్లాది యయ్యె. వారిర్వు

తమహృదయము లన్యోన్యసౌహార్దమునఁ బాదుకొనిననాఁట గోలె ప్రాణమిత్రులై శాస్త్రాధ్యయనాదులయందును, కేళీ విలాసములయందును, గురుసేవనమునందును నరపొరలు మాని యొక్కప్రాణముగ వర్తింప సాగిరి. వారిసంగాతము దినములవెంబడి బలపడి శుక్లపక్షచంద్రునిచంద్రికను బురుడించుచుండె. కుచేలునిసంగడీఁడు నీలమేఘచ్ఛాయఁ బోలు మేనివాఁడు. పద్మపత్రముల నిరసించు నేత్రములవాఁడు. ఆజానుబాహుగుల్ఫములవాఁడు. కర్ణకుండలములవాఁడు. కౌస్తుభాలంకారుఁడు. సునిశితబుద్ధిసంపద గలవాఁడు. అయిన నేమి? ఆనవమన్మథాకారుని కీవిప్రబాలునియందుఁ గలయ వ్యాజానురాగమునకు హద్దు లేదు. జగన్మోహనాకార మగు వానిరూపమునకుఁ దోడపూర్వమేధాసంపత్తి కూడఁ గలదు. కావుననే యసమానశేముషీరాజితుఁ డగుకుచేలుని గుర్తించి చెలిమి చేయఁ గలిగె. శిష్యకోటియం దీయిర్వురవటుల యందును సాందీపునికిఁ గలప్రేమభర మింతింత నరాదు. బుద్ధి సూక్ష్మత గలశిష్యులయందు గురుస్వాముల కట్టిప్రేమానురాగము లుదయించుట సహజమే గదా! క్రియాకారులు తమ గురువులను మర్కటకిశోరన్యాయమున ననుగమించిన వారు మార్జాలకిశోరన్యాయమున సాకుచుందురు. ఆనాఁటివిద్యార్థులకు గురుదంపతులే దైవసము లగుటంజేసి వారియెడ నఱమరలేనికూరిమి మెఱయ నిర్మలాంతఃకరణముతో వారు గురుపూజనము గావించుచుందురు.

నిరంతరగురుసేవానిరతుం డగుకుచేలుం డొకనాఁడు తనయిష్టసఖుని గూడుకొని గురుపత్నినియుక్తుండై సమిధలు గొనితేర నడవికిఁ జనియె. అంతలో జీమూతవ్రాతములు విజృంభించి ఘుమఘుమారావములతో నాకసమున విహరింపఁ దొడంగె. నానావిధజంతుసంతానమునకుఁ బ్రళయమట్లు ఝంఝూనిలము భీషణఘోషణమున వీనఁ బూనె. దిగ్వేదండములతుండములభాతి వర్షధార లిలాతలమ్మున ముమ్మరముగఁ బడుచుండె. విద్యుల్లతలు ఖద్యోతకిరణనికరమును మఱపించుచుండె. అరమ్రగ్గి మ్రగ్గినఫలంబుభాతి పతంగబింబము చరమాద్రిమాఁటునఁ జేరఁగొనియె. అంధకారము నీరంధ్రమై కకుబంతముల నాశ్రయించె. సందుగొందులు, మిట్టపల్లములు నేర్పరించుట కసాధ్యముగ నుండె. కటికచీఁకటిని గన్నులు గానరాక వటువు లొండొరులు చేతు లూఁతగఁ గొని కాననాంతరమున నడయాడుచుండిరి. శరీరావయవములు ప్రభూతశీతమునఁ గొంకువోవసాగె. గురుభక్తితత్పరుం డగుకుచేలుం డానడికిరేయి మిత్రునిఁ గూడికొని పడినయుత్తలపాటు చెప్పఁ దరము కాదు. కొలకొల గూయుపక్షులకూజితములును తెలతెలవాఱుదూర్పు రేఖలును మందమందగమనమున వీతెంచుశీతవాతపోతములును ప్రభాత సమయమును సూచించుచుండె. అంతటఁ బొడుపుగుబ్బలి రాయనికిఁ గిరీటమై యంశుమంతుఁడు జూపట్టె. తెలివెలుంగులు దిగ్వితానమున నిండె.

అత్తఱి వానకాఁకునకును వలిగాలిసోఁకునకును శిష్యు లేమైరో యని వడలు వొడమ సాందీపుఁడు వారిని వెదక బయలువెడలెను. కొండొకవడికిఁ జెక్కుచెదరక యడవి త్రోవను నడచివచ్చు చిన్నవడుగులఁ బొడగని స్వాంతమున సంతసించి వారిని జేరఁ జీరి క్రుచ్చి కవుఁగిలించుకొని కటకటం బడుచు నాత్మఖేదమును వెలిపుచ్చె. పిమ్మట వారి నుద్దేశించి సాందీపుఁ డిట్లనియె. "శిష్యులు మాకొఱకు దారుణాటవిని సముత్కటపరిపీడ నొందితిరి. మాఋణము నీఁగుట కిదియె చాలును. కావున నిటమీఁద మీకు సమకూరెడుఁ గో "విస్ఫుటధనబంధుదారబహుపుత్ర విభూతి జయాయు రున్నతుల్" అని దీవించి గారవించి నిజమందిరమునకుఁ దోకొని పోయెు. ఔరా! కుచేలా! నీజీవిత మెంత ధన్యమైనది? నీభావిజీవితపరిణామమునకు సద్గురుని యాశీర్వాదము మార్గదర్శిక మగును గాక! అంతటితో మనవటువుల గురుకులవాస దీక్ష ముగిసెను. అనంతరము వారు గురుదంపతుల మంగళాశాసనములతోఁ దమతమ భవిష్యజ్జీవితపరమార్థచింతలతో శాంతినికేతనమును వీడి తమతమనివాసంబులకుం జనిరి.

ప్రణయతత్త్వమును బోధించు శుకపికశారికానికరంబుల మనోహారగీతములనడుమ నిశ్చింతముగను నిశ్చలదీక్షతోను, నిరంతరోత్సాహముతోను వేదాదివివిధవిద్యల నభ్యసించి సులభసుఖం బగు తద్బ్రహ్మచర్యాశ్రమము నిప్పుడు డిగ్గవిడిచి కుచేలుఁడు వివిధవిషయవాసనా[illegible] మగు గృహస్థా

శ్రమమునఁ బ్రవేశించె. అతఁడు మానధనుఁడును, విజితేంద్రియుఁడును, బ్రహ్మవేత్తయు, శాంతుఁడును, హరిపాదతీర్థసంసేవానిరతుఁడును నై నెగడు పరమభాగవతాగ్రేసరుఁ డైనను నిరంతరమహాఘోరదారిద్ర్యమునఁ బీడింపఁబడుచుండె. కాలక్రమమునఁ గులశీలరూపాభిజాత్యయగు సుశీలవలనఁ బెక్కండ్రు సుతులఁ బడసె. బాపురే! శాంతి దాంతి వైరాగ్యసంపదల నడుమ నుద్దీపించు పరమభాగవతశ్రేష్ఠుఁడు దుస్సహదారిద్ర్యపీడకు లోఁబడక తీఱినదికాదు. ఎంతవాని కేని విధి యలంఘనీయము కదా! దారిద్ర్యదవానలమునఁ బడి మడియునాఁడు కూడ కుచేలుఁడు పరద్రవ్యమును లోష్ఠముక్రియ భావించి నిరసించునే కాని లేమివశమున దేహి యని పరుల యాచింపఁడు. తనకుఁ దా నబ్బినట్టియల్పమే పదివేలుగ భావించి యుబ్బుచుఁ బుత్రదారాభిరతిను నొకవిధమునఁ గావించుచుండె.

ఒకనాఁడు బిడ్డలు దుస్సహదరిద్రపీడచే నొచ్చియాఁకటిచిచ్చునఁ గృశియించి మలమలమాడిపోవుచుఁ బెదవులు దడుపుకొనుచుఁ గడుపులు నకనకలాడుచు వెన్నున కంటుకొనిపోవఁ జూచువారలగర్భకుహరము లవియునట్లుగ నాకు దొప్పలు చేతఁ బట్టుకొని యమ్మా పట్టెఁడోగిరమును బెట్టవే యని యంగలార్చుచుఁ దల్లిని సమీపించి చినిఁగిన చీరకొంగును బట్టి లాగఁ జొచ్చిరి. కొందఱు తల్లిని జుట్టుముట్టి యాహారసంపాదనమునకై పరిదేవన మొనరించుచుండిరి.

మఱికొందఱు కాలుసేతు లల్లాడుచుండ నడయాడ నేరక యొకచోఁ గూలఁబడి యమ్మా కడుపు మాడుచున్న దే యని యంగలార్చుచుండిరి. దారిద్ర్యదేవత తనివినొందఁజాలక బహుపుత్రరూపమున నాపైఁ జుట్టుముట్టి కాఱియఁబెట్టుచుండ మూర్తి దాల్చినశోకదేవత నా నొప్పారు నాయిల్లాలిని గాంచినవారియుల్లములు శతధా భిన్నము లగుచుండె. అంత నాసాధ్వి చేయునది లేక వెడఁదకన్నులఁ దొరఁగువేడిబాష్పములఁ గొనగోట మీటుచు నిజాధినాథుని జేరి "ఓజీవితేశ! తట్టుముట్టాడుపేదఱిక మిట్లు కాఱియవెట్టుచుండ దీనికుపాయ మూహింపరైతిరి. నాథా! బిడ్డలాహారాపేక్షం గావించు పరిదేవనములు హృదయవిదారణ మొనరించుచున్నవి. వారి యాక్రందనధ్వనులచే హృదయము వ్రీలి వ్రక్క లగుచున్నది. ప్రాణేశ్వరా! ద్వారకాధినాథుఁ డగు పద్మపత్రనేత్రుఁడు మీబాల్యసఖుఁ డని విందును. కాన మీ రట కేగి హరికృపాకటాక్షదీప్తిచే దారిద్ర్యాంధకారమగ్నుల మగు మ మ్ముద్ధరింపరే" యని వేఁడుకొనియె.

అందుల కాభూదేవోత్తముఁడు డెందమునఁ గ్రించుదన మూనక యమ్మానినీమణి పలుకుసమయోచితవచనంబుల కలరి యారాజీవనేత్రు నాశ్రయింపఁ జనుట యిహపరసాధనమని విశ్వసించె. తోడ్తోన శైశవక్రీడాకలాపములు స్ఫురణకుం దవిలి మిత్రదర్శనోత్సాహమును రెట్టించెను. కాని యాచక్రపాణికిఁ గానుక యేమైనఁ గొంపోవలయు నని వాని

యాస్థ. నిజాధినాథునియాత్తగతం బెఱిఁగి వానియిల్లాలు చంద్రునకు నూలుపోఁగుచందమున వానిజీర్ణచేలాంచలమునఁ బృథుకతండులములఁ గొన్నిటి ముడిచి నెయ్యము నెఱపె. గోవిందసందర్శనోత్సాహియై వెడలుకుచేలుఁడు తనడెందమున నిట్లు వితర్కింపఁ సాగె. "భర్మమణిమయగోపురప్రాసాద సౌధహర్మ్యప్రభావిలసిత మగుద్వారకానగర మెక్కడ! భానురశుద్ధాంతవాసి యగుపుండరీకాక్షుఁ డేడ! అయఖిలేశుని సందర్శించుమహాభాగ్య మెట్టిది? అనగరికావలివాం డ్రెక్కడి విప్రుఁడవు? ఇందేల వచ్చితి?, వనుచు నడ్డువెట్టరేని వారల కేమి యొసంగి సమ్మతులఁ జేయువాఁడ? ధనహీనుఁడ. అయదు కులాంభోధిచంద్రుని దర్శించుటకు నాయాశాతరంగము విజృంభించుచున్నది. నన్నాతఁ డుపేక్ష సేయునా? ఆ? యివి యేటిమాటలు? కానిమ్ము నాభాగ్య మెట్లున్నదో చూచెదఁ గాక." అని తలపోయుచు నడచుచుండఁ గట్టెదుట,

మ. కనియెఁ ఘూనురవంశశేఖరుఁడు రంగత్ఫుల్లరాజీవకో
కనదోత్తుంగతరంగసంగతలసత్కూపారకన్ భూరిశో
భననిత్యోన్నతసౌఖ్యభారకను శుంభద్దివ్యభావోదారకన్
జనసంతాపనివారకన్ సుజనభాస్వత్తారకన్ ద్వారకన్.

అట్టిపురవైభవమున కక్కజ మందుచు రాజమార్గంబునఁ జని చని పెక్కుకక్ష్యాంతరములు గడచి చనుడు ముందర నొక సుందరవధూమణిమందిరమున నిందీవరనేత్రలు చామరములు వీవ హంసతూలికాతల్పమున,

సీ. ఇందీవరశ్యాము వందితసుత్రాముఁ గరుణాలవాలు భాసురకపోలుఁ
గౌస్తుభాలంకారుఁ గామితమందారు సురుచిరలావణ్యు సురశరణ్యు
హర్యక్షనిభమధ్యు నఖిలలోకారాధ్యు ఘనచక్రహస్తు జగత్ప్రశస్తు
ఖగకులాధిపయానుఁ గౌశేయపరిధానుఁ బన్నగశయను నబ్జాతనయను
మకరకుండలసద్భూషు మంజుభాషు। నిరుపమాకారు దుగ్ధసాగరవిహారు
భూరిగుణసాంద్రు యదుకులాంభోధిచంద్రు। విష్ణు రోచిష్ణు జిష్ణుసహిష్ణుఁ గృష్ణు

నవలోకించె. ఇట్లు బహువినోదములం దనరి లావణ్యమన్మథాకారుం డగుపుండరీకాయతాక్షుఁడు కన్నులచందమామయై కనుపట్టఁ జిన్ననాఁట గురుకులవాసావసరమున సహపాఠియుఁ బ్రాణమిత్రుఁడును నగుగోపాలబాలకునికలయాపు గుర్తెఱింగి బాల్యస్నేహపాటవమునఁ జెలియలికట్ట దాఁట నుంకించుభావతరంగములపోటుపాటులనడుమ నుయ్యాల లూఁగుచుఁ బార్వణచంద్రబింబము నాఁ దగునాతనిచల్లనిమూర్తిని గాంచి తూర్తి దీఱ జోత లిడి యర్ధోన్మీలితనేత్రుఁడై కుచేలుఁడు పులకితగాత్రుఁడై యల్లనల్లన నాతని సమీపింపఁ బోవుచుండె.

అత్తెఱంగున ఘనతృష్ణాతురచిత్తమున నుత్తలమందువానిని, హాస్యమునకుఁ జోటైనవానిని, జీర్ణాంబరధరుని, నత్యంతదరిద్రపీడితుని, కృశీభూతాంగమునఁ దను జేర నుంకించుపేదవిప్రుని సల్లంతనె కని శ్రీకృష్ణుఁడు సంభ్రమాదరాయత్తచిత్తంబునఁ దల్పమును డిగ్గి యెదురేగి బంధుస్నేహస్ఫురణమునఁ దోడితెచ్చి నిజతల్పమున సుఖాసీనునిం జేసె.

తదనంతరము కనకకలశసలిలముచేఁ గాళ్ళు గడిగి భక్తిమై తజ్జలంబులు శిరసునఁ జల్లుకొని మనోహరమృగమదఘనసార మిళితమలయజమును మేన నలంది శ్రీహరి తాళవృంతమును జేఁబూని విప్రునిశ్రమ వాయ వీవఁ దొడంగె. ఆచెంగటఁ బద్మలోచనుఁడు మన్నించునంగనామణి యగురుక్మిణి కరకంకణంబులు గల్లు మనఁ జామరంబు గొని చల్లగ వీఁచుచుండె. భళిరా! మణిమయగోపురప్రాసాదసౌధహర్మ్యముల నివసించుమురహరుం డేడ? అడవినడుము నాకుటింటఁ గాఁపురము సేయుబడుగుబాపఁ డేడ? బాల్యస్నేహస్ఫురణ మెంత శ్లాఘాపాత్రము? ఇట్టివింతను గాంచుశుద్ధాంతకాంతానివహంబు లద్భుతతరంగితాంతరంగులై యిట్లు తలపోయ సాగిరి.

ఉ. ఏమితపంబు సేసె నొకొ యీధరణీదివిజోత్తముండు తొల్
బామున యోగివిస్ఫురదుపాస్యకుఁడై తనరారునిజగ
త్స్వామి రమాధినాథునిజతల్పమునన్ వసియించియున్నవాఁ
డీమహనీయమూర్తి కినయే మునిపుంగవు లెంతవారలున్.

అదియునుం గాక,

చం. తనమృదుతల్పమందు వనితామణి యైనరమాలలామపొం
దును నెడఁగాఁ దలంపక యదుప్రవరుం డెదురేగి పాదముం
దమకఁగ గౌఁగిలించి యుచితక్రియలం బరితుష్టిఁ జేయుచున్
వినయమునన్ భజించె ధరణీసురుఁ డెంతటిభాగ్యవంతుఁడో?

ఈతీరున రమాధినాథునిమృదుతల్పమున శయనించి మేనఁ బులకాంకురంబులు మొలకలెత్త నానందబాష్పబిందు-

సందోహులండై విలసిల్లుపరమభాగవతోత్తముండగుకుచేలునిఁ గాంచి కరముఁ గరమునఁ గీలించి గురుకులవాసోదంతమును సాంతముగ శ్రీహరి ముచ్చటింప దొరఁకొనియె. వెండియు గృహక్షేత్రధనదారపుత్త్రాదులయందుఁ గుచేలునిచిత్తము వేఱై యుండుటఁ గాంచి యుత్తమమార్గమును సూచించి, కుటుంబక్షేమములఁ బరామర్శించి పిన్ననాఁటిచైదములఁ దలపోయసాగె. విద్యాభ్యాసావసరమునఁ దాము కావించినచెలికారమును దలపోయుచు దేశికోత్తమునిశక్తిసామర్థ్యములను, దాము గావించినశుశ్రూషావిధానమును, బ్రళయానిలంబు చండమునఁ బెనుగాలి వీఁచిననాఁటిరాత్రి తా మొంటిగ నరణ్యభూమిని బడినబాములును, గురుదంపతులయవ్యాజానురాగప్రకటనమును దలపోసి యిరువురు నానందమునం దేలియాడుచుండిరి.

ఇట్లు పెద్దయుంబ్రొద్దు గడచుటయు సర్వలోకహృదంతర్వర్తి యగునాయదుకులచక్రవర్తి మందహాసరోచిరుదంచితసుందరవదనారవిందుఁడై కుచేలునిం గాంచి యిట్లనియె. "సఖుఁడా! మదీయసందర్శనార్థ మీ విట కరుదెంచుచు నాకుఁ గానుకగ నేమి తెచ్చితివి? అప్పదార్థ మెట్టిది యైనను గొంచె మైనను గొప్పగ భావించి స్వీకరింతు. సందియంబు వలదు. భక్తితాత్పర్యములు ప్రధానములు గాని వస్తుపరిమితి కానోపదు. భక్తిశూన్యుఁ డగునీచవర్తనుఁడు హేమాచలతుల్యం బైనపదార్థమును బారితోషికముగ నిడినను నాయు

ల్లము పల్లవింపదు. భక్తిప్రధానుఁ డగుమానవుఁ డొసంగు దళమైనను, బుష్పమైనను, ఫలసలిలము లైనను, నమృతము ్తని యారగించెద.” అనవుడు నావిప్రవరుఁడు సంకోచించి మోము వంచి మిన్నకుండె. అందుల కానందనందనుఁడు నందియు మంది కలయూవు దివ్యచిత్తమున గ్రహియించి తొల్లింటిభవమున సీతఁ డైశ్వర్యకాముఁ డైనను సేవింప నొల్లఁడు. అయిన నిక్కుచేలుఁడు నిజకాంతాముఖోల్లాసంబు కొఱకు నన్నాశ్రయించినవాఁడు. కాన నీతని కింద్రాదుల కందఁగా రాని సంపద్విశేషంబు లీక్షణంబ యనుగ్రహింప వలయు నని తలంచి జీర్ణచేలాంచలంబున నతఁడు ముడిచి తెచ్చినయడుకులముడిని దడవి “మిత్రమా! యిది యేటిపస దన?” మని నుడువుచు నమ్ముడిని దనకరకమలములను విచ్చి నిండారుముదంబునఁ బృథుకతండులంబులను గొని యియ్యవి సకలలోకములను నన్నును బరితృప్తిం బొందింపఁ జాలు నని భుజియించి వెండియుఁ బిడికెఁడడుకులఁ బరిగ్రహింప సమ కట్టుడు కమలానన తత్కరకమలముఁ బట్టి యిట్లనియె. “త్రిజగత్సంపత్కరా! దేవదేవ! సర్వాత్మక! హరీ! బహు విధసంపదాళి నందింప నివియె చాలును. క్రమ్మఱ భుజియింప నేల? భక్షింప నుడుగుఁ” డని ప్రార్థించె. తదనంతరము వారు గొంతదనుకఁ బరస్పరవిస్రంభసంభాషణములతోఁ గాల మేగించిరి. కుచేలుఁ డారాత్రి గోవిందుమందిరమున హృద యానందకరం బగువిం దారగించి మృదులశయ్యాతలంబున

నిదురించి తనకుఁ దాను సమధికస్వర్గభోగానుభవుం గాఁ దలంచుచు మఱునాఁటివఱువాత మేల్కాంచి నిత్యకృత్యములఁ దీర్చికొని యిందిరారమణునికడ వందనపూర్వకముగ సెలవు గైకొని యాతనిచే నామంత్రితుం డయి నిజపురాభిముఖంబుగ నడచుచుఁ దనడెందమున గోవిందసందర్శనానందసంజనితమహానందమున నిట్లు వితర్కింపఁ దొడఁగె.

"ఆహా! మదీయపూర్వజన్మసుకృతం బెంతఘనం బైనది? అనన్యసామాన్యదుర్లభం బగు పరంధాముని దివ్యసందర్శనము నిరాయాసముగఁ గరస్థ మైనది. నిరంతరదారిద్ర్యాంధకారమునఁ దొట్రుఁగులాడు నే నెక్కడ? నిత్యలక్ష్మీనివాసుఁడై తనరారు వాసుదేవుఁ డెక్కడ? ఏకగర్భసంజాతునికన్న మిన్నగఁ బరిరంభణాదిక్రియల నన్నాతఁ డాదరించి తల్పమున నుంచి మన్నించి నిజవధూకరసరోజాతకలితచామరానిలమున విగతశ్రమునిఁ జేసి త్రైలోక్యాతుణప్రశస్తంబు లగు హస్తంబులచే నడుగు లొత్తి భక్తి నెఱపె. దరిద్రుఁడు సంపదంధుఁడై హరిపాదసంసేవనావిరక్తిం దవిలి నశియించు నని కాక లేకున్న శ్రీతాత్రిహారుండు నన్ను సర్వవస్తుసమధికునిగాఁ జేయకుండునే?" యని తలపోయుచుఁ జని చని కట్టెదుట,

సీ. భానుచంద్రప్రభాభాసమానస్వర్ణచంద్రకాంతోపలసౌధములను
కలకంఠశుకపికకంఠసముత్కరారావితకూజితోద్యానములును
ఫుల్లసితాంభోజ హల్లక కహ్లార కైరవోల్లసితకాసారములును
మణిమయూరకవలకంకణముఖాభరణవిభ్రాజితదాసదాసీజనములఁ
గలిగి చెలువొందుసదనంబు గాంచి... ... ... ...

యచ్చెరు వొందుచు వైభవోన్నతలక్ష్మినివాన మగు నీసౌధతలమున వసియించుభాగ్యశాలి యెవ్వఁడో కదా! యని తలపోయుచుండునవసరమున దివిజకాంతలఁ దిరస్కరించు చేడియలు కొందఱు సమీపించి స్వామీ! యిందు విచ్చేయుఁడని వియ్యము నెఱపిరి. అంతలోఁ బతిరాకను గ్రహించి వినయవినమితగాత్రమున నూ పొందిన యిందిరాదేవిచంద మునఁ బతివ్రతాతిలక మగు సుశీలాదేవి నాథుని సన్నిధాన మున కరుదెంచి సువర్ణకలశజలంబులఁ బాదములు గడిగి మెత్తనిపట్టుపుట్టంబులఁ దడియార నొత్తి మించినభక్తితోఁ గమనీయపద్మరాగస్తంభకములును, మకరతనవరత్నమయ కవాటములును, చంద్రకాంతోపలవేదికాజాలములును, కత హంసతూలికాతల్పములును గలిగి చెలువొందుమందిరాంగణ మునకుఁ దోడ్కొనిపోయి రత్నసింహాసనాసీనునిఁ గావించె. ఈచందమున నాతఁడప్రయత్నంబుగ నచిరకాలంబునఁ దమకు లభ్యమయిన వివిధచిత్రసంపదాళిని గాంచి మాధవానుగ్రహ మని తలంచి హరిదయావలోకనశ్రీల కభివందనము లొనరించి తొల్లింటికన్న మిన్నగఁ బురుషోత్తముని యందు భక్తిశ్రద్ధలం దవిలి చరమజీవితమును భక్తజన సంతానమున కాదర్శప్రాయముగఁ బ్రదర్శించె. జీవితాంతము దనుకఁ గారుణ్యసాగరుఁడైన గోవిందునిదివ్యచరణారవిందముల సేవించుచుఁ గాముకభోగముల విడిచి రాగాదివిరహితస్వాంతుఁడై చరాచరజంతువర్గములయం దీశ్వరసారూప్యమును

భావించుచు విగతబంధనుఁడై యపవర్గమును బ్రాపించెను.

నిఱుపేదబిడ్డల యార్తస్వరంబున నమృతగీతికలనాలించి పాలించిన జననీజనకులు— నిఱుపేదతనమున నిధినాయకత్వమును జూఱలాడినమహీసురులు— ప్రాఁతపేలికలయందుఁ బసిఁడిచేలములతళుకుఁ గాంచి మించిన తృప్తిధనులు— నికృష్టకష్టజలధియందు నానందరమతోడఁ గూడిమాడిన పుణ్యదంపతులు— అతిథులందును, ననదలందును, నార్తుల మొదలను నాత్మసాదృశ్యమును గాంచి కాలగర్భమున విశ్రమించిన యీపుణ్యదంపతుల పూతచారిత్రము భారతజాతి విద్యార్థుల భావిజీవితపరిణామమునకుఁ జేయూఁత నొసంగి వారిం గృతార్థులఁ జేయుఁ గాక.



# అంబరీషుఁడు

పాలనప్రాభవమున భరతఖండమును యశశ్చంద్రికలచేఁ గప్పి ధర్మప్రతిష్ఠాపనమే యవశ్యకర్తవ్యముగఁ బాలించి, మూర్తీభవించిన యార్తత్రాణపరాయణత్వము నాఁ బరఁగు సనాతనరాజచూడామణుల పవిత్రకార్యములు నేఁటికిని లెక్కకు మీఱియున్నవి. అందు సత్యపాలనమునఁ గొందఱు, నాశ్రితరక్షణమునఁ గొందఱు, ధర్మపోషణమున మఱికొందఱును భారతజాతికి వన్నెదెచ్చినవారై యశఃకాయముల నివ్వటిలుచున్నారు. వారిలో క్షత్రియకులశిరోభూషణుఁడును మహావిభవవిరాజితుఁడును, విష్ణుభక్తాగ్రేసరుఁడును, సద్గుణగరిష్ఠుఁడును నై యొప్పిన నంబరీషరాజపుంగవుని చరిత్ర మతి పవిత్రము. ఈతఁడు సత్యవచోధురీణుఁ డని వాసి గాంచిన నభగునిపౌత్రుఁడు. పితృవాక్యపరిపాలనాసక్తుఁడు బ్రహ్మజ్ఞానపారీణుఁడు నై పరిఢవిల్లిన నాభాగుని పుత్రుఁడు. సప్తద్వీపపరీతభూతల మీతనికిఁ గ్రీడారంగము. వైష్ణవప్రపత్తియే యీసీ రాజ్యరమకు ముఖ్యాలంకారము. సమస్తవైభవములచేఁ దులతూఁగు నీమహారాజధికారమదాంధుఁడు గాక యైహికముల యందు మిథ్యాభావమును బాదుకొల్పి సర్వావయవములును విష్ణుకైంకర్యమునకు సమర్పణము చేసి వైదికధర్మములకు నేనాఁటికిని యంతయుఁ బాటిలకుండ ఛాయయై వర్తించు సహధర్మచారిణితోఁ గాలము పుచ్చుచుండె. తా నేకార్య మొనరించి

నను హరి యని సంభావించు; దర్శించు; అఘ్రాణించు; రుచిఁ గొనఁ దలంచు. ఈతీరున నప్పరమభాగవతశిఖామణి వసిష్ఠాదిముని శ్రేష్ఠులతోఁ గూడికొని సరస్వతీతటమున ననేక వాజిమేధము లొనరించి సంతతభూరిదక్షిణలతో భూసుర పరితృప్తిం గావించి మహాతపస్సంపన్నుండై రాజర్షిబిరుద మును గాంచి వెలయుచుండె. ఈచందమున నీశ్వరాయత్త చిత్తమున నవనిఁ బాలించుచుండినయంబరీషరాజర్షి కి వైరాగ్య భావము దినదిన ప్రవర్ధమానమై మిన్నుముట్టుచుండె. దాన నమ్మేదినీకాంతుఁడు హరులందును గరులందును ధనములం దును గేహములందును బుత్త్రమిత్త్రబాంధవానీకములందును నాస్థ వీడి సంసారమువలనఁ దగులంబు విడిచి రాజ్యలక్ష్మిని మంత్రివరులయధీనము కావించి నిర్మలుఁడై యేకాంతంబున నితాంతభక్తిపరవశుఁడై యుండె. అంతరంగభక్తుం డగు నారాచతపసియోగమహిమకు మెచ్చి భక్తలోకపాలుఁ డగు పరంధాముఁడు వైరిభటశిక్షణంబును, స్వజనసంరక్షణంబును నిర్వక్రపరాక్రమంబు నగు చక్రాయుధము నొసంగి యనుగ్ర హించె.

అనంతర మాపరమభాగవతోత్తముఁ డుభయతారక మగు ద్వాదశీవ్రత మనురూపగుణాఢ్య యగు నాత్మమహి షితో నొక్కవత్సర మొనరింప సంకల్పించి నిర్విఘ్నముగ నిర్వహింపసాగె. ఇట్లు వ్రతంబు సలుపుచు నాదంపతులు కార్తికమాసం బాసన్న మగుఁడు వ్రతసమాప్తికై సలయు

పరికరనికరంబులు సేకరించుకొని మధువనంబునకుం బోయి మూఁడురాత్రు లుపవసించి కాళిందీస్రవంతిని గ్రుంకులిడి మహాభిషేకవిధానమున శ్రీహరికి నభిషేకము గావించి నానా విధస్వర్ణమయమణిభూషణములతోడను బట్టు పుట్టముల తోడను నలంకరించి మనోహరపరిమళగంధాక్షతలు సమ ర్పించి యభినవామోదకుసుమనికరంబులచేఁ బూజించిరి. తద నంతర మాతండు వెండిగొరిజలును బసిండిశృంగములును గలిగి క్రేవుల నట్టు నాఁకుచు నంగచ్ఛాయలై విలసిల్లి పయో ధారల వర్షించునాలమందల నఱువదికోట్లను నదక్షిణంబుగ దాన మొనరించె. సంఖ్యాతీతము లగు భూసురబృందమునకు డెంద మలర మృష్టాన్నములతో విందొనరించె. భూదే వోత్తము లారాజదంపతుల వైష్ణవభక్తి కిచ్చ మెచ్చి వా రిడిన చతుర్విధాహారములకు ముద మంది యాశీర్వాదపరం పరలచే వారిని ధన్యులఁ గావించిరి.

ఆతీరున ద్వాదశీదివసము కొంత ముగిసిన పిమ్మటఁ బుడమిఱేఁడు పారణము సేయ నుద్యోగించు నవసరమునఁ దపస్స్వాధ్యాయసంపన్నుఁడు, రవికోటిప్రతిమానతేజుఁడు, రుద్రాంశసంభూతుఁడు నగు దుర్వాసనంయమి తన్నివాసమున కతిథిగా నేతెంచె. అట్లరుగుదెంచినమునివల్లభునకు జనవల్లభుఁ డెదురేగి సముచితసత్కారముల నాదరించి తోడ్కొనివచ్చి భద్రాసనంబిడి పావనజలంబులఁ బాదములు కడిగి తడి యొత్తి సేవ మూరసి తనయింట విందారగింపఁ

ప్రార్థించె. అందుల కామునికుంజరుఁ డమితానందమునఁ బొంగి యంగీకరించి కాళిందీసలిలావగాహం బొనరించి క్రమ్మఱ వచ్చెద నని చనియె. కాని పరమధ్యానమునఁ బ్రవృత్తుఁడై బాహ్యప్రపంచమునే విస్మృతిఁ గన్నమునికులతిలకుని డెందము విందుసంగతిని విస్మరించె. ఇయ్యది యుక్తమేగదా! యమునాతరంగిణిం దానమాడఁ బోయినయత్రితనూజాతుఁ డంతసేపటికిని మడిగిరాఁ డయ్యె. ద్వాదశియు ముహూర్తార్ధావశిష్టమై చూపట్టుచుండె. ఈలోనఁ బారణము సేయకున్న వ్రతభంగము వాటిల్లు. చేసిన బ్రాహ్మణాతిక్రమణదోషము పెనుభూతముక్రియఁ గట్టెదుటఁ బొడకట్టుచుండె. అంబరీషనృపాలుని కడుగులు తడఁబడఁ దొడంగె. కుత్తుక యుత్తరించుకొని పోవుచున్నట్లుండె. హృదయము చలనము మాని స్తంభీభూతము కాఁ దొరకొనియె. లోచనచకోరద్వందము మునిచంద్రునిరాకకై యుత్కంఠతో నెదురుచూచుచుండె. చేయునది లేక యంబరీషుఁడు కర్తవ్యనిరూపణమునకై విద్వజ్జనలోకమును రావించి వారిమ్రోల సర్వమును నివేదించి ధర్మరక్షణోపాయ మనుగ్రహింపుఁ డని వేఁడికొనియె. పదంపడి పండితమండలి తర్కవితర్కములకుఁ బూనుకొనియె. పూర్వపక్షసిద్ధాంతములతోఁ గొంత ప్రొద్దు శాస్త్రగోష్ఠి నెఱపిరి. ఆమంత్రితుం డయినయతిథిని వీడి భుజియించుటయుఁ గాదు. వ్రతోద్దిష్టమైనద్వాదశీపారణము వీడుటయుఁ గాదు. రెంటికిని నడుమ సలిలభక్షణము సమ్మత

మని ధర్మనందేహమును బాపి విద్వల్లోక మనుగ్రహించె. తదనంతర మాభూజాని డెందమున వందియమును మాని హరిపాదసరోరుహము లాత్మ భజియించి నీరపారణంబు చేసి స్నానార్థియై వెడలి కడుఁ దడసినజడదారిరాకను బ్రతీక్షించు చుండె.

అంతట దుర్వాసుఁ డనుష్ఠానముల నిర్వర్తించుకొని మడుఁగుచేలములతో, మెడ వ్రేలురుద్రాక్షమాలికలతో భస్మ గుంఠితఫాలభాగముతో నపరశివుఁడుం బోలె దర్శనమొసంగె. అంబరీషుఁడు వినయవినమితగాత్రుఁడై యాతిథ్యమున వంటకము నేయింపఁ దొడంగె. కాని మునిమానసమునకు నంతయు విలక్షణమై కన్పట్టుడు నాంతరదృష్టిని సర్వమును గ్రహించె. అంబరీషునిసలిలభక్షణరహస్యము బట్టబయలయ్యె. తోడనే జడదారిహృదయము క్రోధఘూర్ణితమై తపింపఁ జొచ్చె. పార్థివేంద్రునిహృదయానుతాపంబును, నిర్నిమిత్తముగఁ గట సించిన విషమపరిస్థితియుఁ గ్రోధాతిరేకమున రేకెత్తినముని రాజుచిత్తము గ్రహింప దయ్యె. అతిథియా గౌరవింపఁదగిన మునిసార్వభౌముఁడు. అందును క్రోధమూర్తియగు దుర్వాసుఁడు. జరిగినది ధర్మభంగము. చెప్పుట కేమున్నది! రంగ మున భీభత్సరసము తొలఁకాడఁ దొడంగె. తపసిరాయఁడు కన్నులఁ గెంపు గదుర ధర్మగ్లానికై హుంకరింపఁ దొడంగె. ఇంద్రుఁడవు చంద్రుఁడ వని కైవారములు సలిపి విందునకుఁ బిలిచినన్నుపాధమున కింతటియధికారమదాంధతయా యని

గద్దింప సాగె. ఇందఱును జూచుచుండుఁడు, విష్ణుభక్తుఁడ నని విఱ్ఱవీఁగు నీనృపకిరాతునిగర్వ మడంచెద నని యుచ్చైస్స్వనంబున బొబ్బలిడుచుఁ జిందులు ద్రొక్కుచుండె. పాపము రాజేమి చేయఁగలఁడు? విద్వాంసు లేమి యొనర్పఁగలరు? పరమకోపి యగు నా తాపసునియెదుర శాస్త్రచర్చలు, ధర్మనిర్ణయములు పనికివచ్చునా! ప్రార్థనలు క్రోధాగ్నికి నాజ్యధారల వంటివి. అంతకంతకు మునిశార్దూలుని క్రోధానలము ప్రజ్వరిల్లఁ దొడంగె. పరాభవాగ్ని ప్రళయాగ్నిగఁ బరిణమింపఁ దొడనే—

చ. పెటపెటఁ బండ్లు గీఁటుచును భీకరుఁడై కనుగ్రేవ నిప్పుకల్
పటపట రాల గండములు పొంగ మునీంద్రుఁడు హుంకరించుచున్
జట మొదలంటగాఁ బెఱికి చిక్కిన దానన కృత్య నాయుధో
త్కటబలమానవాస్త్రయుతఁగా నొనరించి నయించె రాజుపైన్.

ఇట్లు భయంకరాకారమున వెడలిన మహాకృత్య యను మొక్కలపురక్కసి యుక్కుమిగిలి కాలానలసన్నిభ మైన శూలాయుధమును గేలఁ గీలించి మనుజవల్లభుని భీకరముగఁ దాఁకె. ఔరా! క్రోధ మెట్టి కార్యమున కైన నొడఁబడుఁ గదా! అందులకు భక్తిస్వరూపుఁ డగు నంబరీషుఁ డించుకయేని చలనమొందక యీశ్వరధ్యానపరాయణుఁడై నిలిచి యుండె. అప్పుడు ప్రేక్షకులు కన్నులు మోడ్చి హాహాకారములు సేయుచుండిరి. సర్వాంతర్యామి యై భక్తుఁ డగు నంబరీషుని పవిత్రాంతరాత్మను లీనమైయుండిన పరంధాముఁడు

వెఱ్ఱితపసి చేయు వేడబములఁ జిక్కఁబెట్టు మని చక్రాయుధమును బనిచె. అంతటఁ జిమ్మచీఁకటుల యుమ్మరము నడఁగఁ ద్రొక్కు బంగరుమెఱుంగులఁ దుఱంగలించుచు విష్ణుదేవు చక్రము నిర్వక్రపరాక్రమంబునఁ గృత్యను డీకొనియె. ఉభయ శక్తులకును బోరు ఘోరంబగుడుఁ బ్రళయవహ్నివగిదిఁ బ్రజ్వరిల్లు చక్రధారలను గృత్య నమసిపోయె. అప్పటికిని దాహశాంతిఁ గాకుండుటం జేసి సుదర్శనాయుధము మునివెంట నంటె. మునివల్లభుం డుల్లమున వెల్లగఁ దల్లడిల్లఁ దొడఁగె. విడుచుటకు శాపోదకములు గావు. కుడుచుటకు ద్వాదశీపారణముగాదు. తిరస్కరించి నోనాడుటకు నంబరీషరాజర్షి కాఁడు. సహస్రధారాకరాళంబై విక్రమించుచక్రానలజ్వాల. కావునఁ దాపసోత్తముఁడు భీతచేతస్కుఁడై కాలికొలందిగ నూడనిం బాడి మేరుగుహ సొత్తెంచె. అదియు నురగంబు వెనుకొను దవానలంబుచందంబునఁ దోన చొరఁబడియె. మఱియు,

మ. భువిఁ దూఱిన్ భువిఁ దూఱు, నబ్ధిఁ జొర నబ్ధుల్ సొచ్చు, నుద్యోగియై
దివిఁ బ్రాఁకన్ దివిఁ బ్రాఁకు, దిక్కులకుఁ బో దిగ్వ్యాప్తులం బోవుఁ, జి
క్కి వెసం గ్రుంగినఁ గ్రుంగు, నిల్వ నిలుచుం, గేడింపఁ గేడించు నొ
క్కెడిన్ దాపసువెంట నంటి హరిచక్రం బవ్యయుర్వక్రమై.

ఇంతలోఁ దాపసి కాయాసము హెచ్చె. చేయునది లేక కొందలమందుడెందముతో విశ్వజనవ్యాపారపారీణుఁ డగు విధాతను శరణుచొచ్చి కరుణఁ జూడు మని ముని వేడికొనియె. అందుల కానలుమోములవేలుపు హరిచక్రానలకీలల నద్దుకొను

సామర్థ్యము తనకు లే దని సూచించుటయే కాక యింద్ర దక్ష ప్రజాపతి భృగు భూతపతులు గూడ వానియాజ్ఞ జగద్ధిత మని తలఁ దాల్తురు కావున సుదర్శననివారణం బనివార్యంబ యని వచియించె. దుర్వాసుఁడు గలఁత నొందినహృదయముతోఁ గైలాసవాసుఁ డగుపార్వతీపతిని దర్శించి చక్రోదంతమును సాంతముగ విన్నవించుకొని రక్షింపవే యని పాదముల వ్రాలె. ఈశ్వరుఁడు వానిదగుదైన్య మవలోకించి "వత్సా! శ్రీహరి జగదాధారుఁడు. కాలానుసారముగ వానియందుఁ బెక్కువేల జీవరాసులు సృష్టిస్థితిలయము లందుచుండు. అంతియె కాక పద్మగర్భుఁడును నేనుఁ బురందరుఁడును నారద సనత్కుమార కపిలమరీచ్యాదిమహర్షులుఁ గూడ వెడమాయలఁ దగిలి వర్తింతుము. కావునఁ ద్రిజగన్మోహనమూర్తి యగువానిచక్రాయుధ ముపసంహరింప నేరము. కావున నో మునీంద్రా! నీ వమ్మహాత్మునే శరణంబు వేఁడుము. ఆతం డొక్కరుఁడ నీకు మేలు నేకూర్పఁగలవాఁ" డని శర్వుఁ డానతిచ్చె. తోడనే దుర్వాసునిమూర్తిదృష్టులు విశాలభూవలయమునంతను జుట్టివచ్చినవి. కాని రక్షణస్థానము గోచరింపదయ్యె. స్వప్రాణసంరక్షణార్థము శ్రీహరియే దిక్కని వెనుకాడుపాదయుగళితో నాతపసి వైకుంఠనగరముం జేరి,

శా. ఆవైకుంఠములోనికర్మమణిసౌధాగ్రంబుపై లచ్చి దాఁ
గ్రేవన్ మెల్లన నర్మభాషణములం గ్రీడించుచున్యన్ హరిన్
దేవాధీశ్వరుఁ గాంచి "యోవరద! యోదేవేశ! యోధీశ్వర
హా! విద్యాపరతంత్ర! మానుపఁ గదే చక్రానలజ్వాలలన్.

"ఓయీ రక్షాత్రాణపరాయణా! రక్షింపుము. రక్షింపుము. అపారమైన నీదివ్యమహిమ నిక్కముగ నెఱుంగ నేరక నీప్రియభక్తుని కపచారంబు గావించి యపరాధి నైతి. అతిథి తిరస్కారంబు సహింప నోడి రోషమునఁ జేసినదోషము నాకు మోస మయ్యె. అంబరీషచక్రవర్తి నీ కింత గూర్చువాఁ డనియు నచ్చినచుట్ట మనియు మది నెఱుంగక భంగపడితి. కృపాళూ! దీనజనచింతామణీ! యాగ్రహము వీడి చక్ర జ్వాల నుపసంహరించి యనుగ్రహింపవే" యని దీనాతిదీన ముగ వేఁడుకొనఁ జొచ్చె.

ఇట్లు సాఁగిలంబడి లేవక యున్నదుర్వాసునిం గని పురుషోత్తముఁడు "తాపసవరేణ్యా! మహిమంతు లగుసాధు వులు నాహృదయము సొచ్చి రహస్య మెఱిఁగి భక్తిలతా పాశంబుల నేర్పు మెఱయ నన్ను బంధించిరి వెడదు. దానం జేసి నిగళబద్ధ మగుమదకరీంద్రమువడువునను కోడెను వీడఁ జాలనిగోవుభంగిని భక్తుల వెనుదవిలియుందు. ఆలిని సంప దాలిని గూడ విడిచి తనువు రోసి తనయులను జుట్టాలను బాసి సర్వమునకు నేనె దిక్కని నమ్మి వర్తించుభక్తజనము లెట్టివార లైనను వారిని పోనాడ నేర. సాధులహృదయము నాసదనము. నాహృదయము సాధువులయధీనము. నేను సాధుజనుల నెఱుంగుదు. సాధులు నాచరిత మెఱుంగుదురు. మే మనన్యగతికులము. నాభక్తసంతానములయందు నాతే జము పూర్తిగ మూర్తీభవించి యుండు. నీవు భూసురో త్త

ముఁడ వయ్యు వంశార్హంబైనసత్త్వగుణంబును బోనాడితివి. బ్రాహ్మణోత్తములు తపము విద్య యనుదివ్యసాధనములవలన నుత్తమగతులను బొందుచుందురు. ధూర్తు లగువారల కీరెండును నార్తికరము లయ్యెడు. తేజోవంతు లగునాభక్తుల కగ్గొనరించినవా రెంతటివారలేని వినాశ మందకపోరు. నీ వీయపరాధమునకుఁ బాత్రుఁడవైనవాఁడవు. కావున నిన్ను వెన్నాడుచుండిన చక్రకీలావళిని మగిడింప నోప. నీయాపదను దొలఁగించి ప్రోవఁ జాలినవాఁడు సదయుఁ డగునాభాగసుతుఁ డొక్కరుఁడ. అన్యుఁ డెంతవాఁ డేని నేరఁ'' డని వచియించి యూరకుండె. శ్రీవల్లభుఁడె యీతీరున నానతిచ్చినతఱిఁ జక్రకీలాజాలజనితాయాసుఁ డగుదుర్వాసునకు భద్రస్థాన మెక్కడిది? సత్యలోకము మొదలు సమస్తలోకములు నిరస్తమైనపుడు నిలువ నీడ యుండునా? త్రిమూర్తుల కంటెఁ గారాని యంబరీషునిభక్తిప్రభావ మే మని కొనియాడఁ దగు? తీవ్రక్రోధమునఁ దిరస్కరించి కాలఁదన్నినవాఁడు తానె యంబరీషునిపాదములపైఁ దలయొగ్గ వలసి వచ్చె. ఔరా! యీశ్వరసంఘటన మెంత విచిత్రమైనది?

తోడనే ముని కృపాసముద్రుఁడును, మంజుభాషుఁడును నగునంబరీషుని సమీపించి జితోస్మి యని పాదము లంటి క్షమియింప వేఁడుకొనియె. పాదములపైఁ బడినముని రాజును గాంచి యంబరీషభక్తునిమానస మెఱియ సాగె. కరుణారసపూరితహృదయుఁ డగునమ్మేదినీకాంతుఁడు కంపితగాత్రుఁడై

తోడ్తోన కృతాంజలియై "నిర్వక్రపరాక్రమున విక్రమించు నోచక్రాయుధమా !

సీ. నీవ పావకుఁడవు నీవ సూర్యుండవు నీవ చంద్రుఁడవు నీవ జలము
నీవ నేలయు నింగి నీవ సమీరంబు నీవ భూతేంద్రియనికరములును
నీవ బ్రహ్మంబును నీవ సత్యంబును నీవ యజ్ఞంబును నీవ ఫలము
నీవ లోకేశులు నీవ సర్వాత్మయు నీవ కాలంబును నీవ జగము

నీవ బహుయజ్ఞభోజివి నీవ నిత్య
మూలతేజంబు నీకు నే మ్రొక్కువాఁడ
నీరజాక్షుండు చాల మన్నించునట్టి
శస్త్రముఖ్యమ కావవే చాల మునిని.

శ్రీహరి కరప్రయుక్తమై విజృంభించునీసంచారవేగ మప్రతిహతంబై లోకాపకారు లగుదుష్టరక్షోవీరులకు గుండె తల్లడ మొదవించుటయే కాక యార్తు లగుశిష్టజనంబుల రక్షించుటయుఁ జేయ నగు. నిద్రాసక్త మగు రక్కసిపిండు నీకలనూపు స్వప్నగతం బగుడు శయ్యాతలంబున నిదురించు తమయిల్లాండ్రు ప్రభాతవాతపోతములకుఁ గలవరము చెంది పలవరింప నిర్యాణమును జెందు. నీయస్తోకసంరంభ ముడిగించి యాపన్నుఁ డగునీతపసిరాయునిఁ గాపాడుము. నీదివ్యతేజము నకు జోహారులు. శాంతించి భూసురప్రాణసంరక్షణము గావిం పుము. వెండియు నేను ధర్మమార్గరతుండ నేని, ధరణీదేవోత్త ములకు దేవతార్హ మగుభక్తి నెఱపితి నేని యీవిప్రునకు శుభం బొనగూరెడుఁ గాక! సృష్టిస్థితిసంహారకారణుఁ డగు

దామోదరున నాంతరంగభక్తుఁడ నగుదునేని భూమీసురుఁడు నిరపాయుఁడై నివ్వటిల్లెడుఁ గాక" యని ప్రార్థించె.

ఇక్ష్వాకుఁ దనకు వేఁడుకోలు వచరించునరనాథోత్త ముని మన్నించి తపసిని దయ దలఁచి కాచి విడిచి దివ్య చక్రము తిరోహిత మయ్యె. రాహుగ్రహవిముక్తుఁడైన రాకాచంద్రునిచందమున మునీంద్రుఁడు కలఁక దేఱి యంబరీషరాజర్షి నుద్దేశించి ప్రసన్నాంతఃకరణంబున దీవించుచు "భళిరే! నరనాథోత్తమా! నేఁ జేసిననేరమును గూరిమిఁ గాచి ప్రోచితివి. నీసాధుశీల మే మని కొనియాడ నేర్తు? హరి పాదాబ్జము లింత ముట్టఁ గొలిచిననీభక్తిప్రభావ మనన్యసులభ మైనది. మంగళతీర్థపాదుని, దేవదేవేశుని నిట్టియకలంకస్థితిని భజించు భక్తావతంసునకు ధారుణీతలమున నందఁగా రాని భద్రంబు లుండునా? జగదాధారుఁ డగుశ్రీమన్నారాయణ దేవుఁడు నీభావమున విశ్వంభరావలయమున నిండి వెలుఁగొందుచున్నాఁడు. ధన్యాత్ముఁడ వైతి" నని యభినందించి యిట్లనియె.

మత్త. తప్పు లోఁగొని చక్రపావకదాహముం జెడబాపితో
నొప్పు నొప్పు భవద్దయారస మోనరేశ్వర ప్రాణముల్
చెప్పరున్ ముని వోయి క్రమ్మఱఁ జేర ధన్యుఁడ వైతి నీ
కెప్పుడున్ శుభ మేను గోరెద నింకఁ బోయెద భూవరా.

ఈతీరునఁ బయనం బగుమునితల్లజునిఁ గాంచి భూవల్లభుఁడు పాదములకుఁ బ్రణమిల్లి తాపసాగ్రణీ! నాయింటఁ

గుడిచి నన్ను ధన్యాత్మునిం జేయవే యని వేఁడుకొనియె. వెండియు నిరాకరించుటకు జడదారికి ధీరత్వ మెక్కడిది? చక్రధ్వానము లింకను శ్రవణపుటంబునఁ బ్రతిధ్వనించుచునే యుండె. మఱుమాటాడక యమ్ముని రాజదుమృష్టాన్నమును భుజించి తృప్తుఁడై నీపావనచరితామృతగీతమును భూమ్యాకాశములు బ్రతిధ్వనించు క్రియ మర్త్యామరులు గీర్తించి ముక్తిప్రదులయ్యెదరు కావుత మని యాశీర్వదించి మింటితెరువున బ్రహ్మలోకమును బట్టి పోయె. పిదప రాజు హృషీకేశునకుఁ దన పయిం గల యవ్యాజానురాగమున కక్కజ మందుచు నతి పవిత్ర మగుభూసురభుక్తశేషమును భుజియించి వత్సరావధికం బగువ్రతమును ముగించి తరించె.

తదనంతర మానరేంద్రుఁడు సంసారం బసార మని రోసి ప్రాజ్యం బగురాజ్యంబును సుగుణమహితు లగుసుతులకు నొప్పగించి తపోవనంబునకుం జని హరిభక్తిపరాయణుండై తపం బొనరించి దేహాంతరమున విష్ణుసాయుజ్యమును బడసె.

భూతలేంద్రుఁడై దివ్యచారిత్రమునఁ ద్రిమూర్తులను మెప్పించి బ్రాహ్మణశాపమును గూడఁ దృణీకరించి ద్విగుణీకృతనిర్మలకీర్తిచంద్రికాసారమున భారతక్షేత్రచారిత్రమునకు వింతవెలుఁగు లిడి చిరయశంబు స్థాపించి యస్తమిల్లిన నాభాగసుతునికథావిధానము దృక్పథమున నిడుకొని వర్తించు విద్యార్థులజీవితాశయములు సఫలీకృతములు గాక మానవు.

శ్రద్ధాళువులై దీనిం బఠియించువిద్యార్థుల కీఫలశ్రుతి శ్రవణానందసంధాయకమై కామితార్థము లనుగ్రహింప నోపు.

క. ఈయంబరీషచరితముఁ
దీయంబున విన్నఁ జదువ ధీసంపన్నుం
డై యుండును భోగపరుం
డై యుండును నరుఁడు పుణ్యుఁడై యుండు నృపా.



# ధ్రువుఁడు

సుశ్లోకు లగుపుణ్యమూర్తుల పూతచారిత్రములే భాషావధూటి కలంకారములు. వారిసత్ప్రవర్తనాదికములే యువజనప్రకరంబుల ధార్మికజీవనోన్నతి కాదర్శములు. వారి శుభ్రకీర్తిని బరిపోషించుటయే లోకకళ్యాణము. గాఢాంధకారమునఁ బ్రాకులాడుపాంథజనాళికి విద్యుల్లతాప్రభలవలె సంసారయాత్రాపరులకు వారిపావనచారిత్రములు మార్గదర్శకములైనదివ్యదీపికలు. భరతఖండము ముందుఁ జెందఁగల యౌన్నత్యము విద్యార్థిలోకము సత్ప్రవర్తనము ననుసరించియుండును. పూర్వులగుమహాపూరుషులసచ్చరిత్రములఁ బఠించుటకంటె దానికి వేఱుశరణ్యము లేదు. వానిలో నసమానతేజఃపుంజమునఁ బ్రకాశించురాజచంద్రులదివ్యచారిత్రములు లేఁబ్రాయమున విలసిల్లుడింభకులజీవితవికాససౌధవీథికిఁ బునాదులు. మహాపూరుషులదివ్యకథామృతము దనివారఁ గ్రోలి సుఖించిన నర్భకులజీవితపరిణామము లోకమంగళమునకు నిదానము. ఆత్మగౌరవమునకై శైశవముననే శరీర మర్పించి యశము గాంచి మించినబాలభక్తునియద్భుతచారిత్రము తరుణవయస్కులకుఁ గర్ణపేయము గానోపు. ధ్రువుఁ డనుపేరఁ బరఁగురాజకుమారవీరునిశుభ్రచారిత్రము పఠియింపనిబాలవిద్యార్థులు తమజాతీయజీవితసత్వమ్మును వమ్మొనరించుకొనినవారని భావింప నగు.

లోకోద్ధరణమునకుఁ జంద్రధరకళాకలితుండై జలజగర్భున కుద్భవించిన స్వాయంభువమనువు ధ్రువునిపితామహుఁడు. సుభగచారిత్రుఁ డగునుత్తానపాదుఁ డనురాజోత్తముఁడు వీని ప్రియజనకుఁడు. ఉత్తానపాదుఁడు సునీతి సురుచి యనునిర్వురుచేడియలఁ బరిణయమాడి భుజవీథి నలంకరించిన ధరాచక్రమును సర్వజనరంజనంబుగఁ ద్రిప్పుచుండె. అద్ధరాతలేంద్రుఁడు న్యాయమార్గమునఁ బాలించుచున్నను గళత్రములయెడ మాత్రము సమభావము వహింప నోపక "ప్రమాదో ధీమతామపి" యనునార్యోక్తికి గుఱి యయ్యె. రెండవభార్య యగుసురుచితోడిదే లోకమని విశ్వసించి సర్వదా యామెకు వశవర్తియై మెలఁగుచుండె. అవ్విధంబునఁ బ్రవర్తించురాజపుంగవునిభార్య లిరువురును గర్భవతులై పూర్ణచంద్రునిఁ దిరస్కరించుబుడుతలఁ గాంచిరి. కాలకర్మవశంబున సునీతిసుతుం డగు ధ్రువునియెడలఁ గూడ రాగమును వీడి యాతఁడు సురుచికొమరుం డగునుత్తమునియందే చిత్తము హత్తించుకొని వర్తించుచుండె. రాజానుగ్రహంబునకుఁ బాత్రంబైన సురుచి గరువతనంబున మురియుచుఁ దనయందును దన యనుంగుబిడ్డయందును మాత్రమే నృపునిడెంద మానందకందళిత మగునట్లు నయగారములు పచరించుచుండె. లోకపాలునిప్రేమావలోకనము దనపై లేకున్న మానెఁ దనూజాతునియెడఁ గూడ లేకపోయెనే యని సునీతి పెద్దయుం బ్రొద్దు వగచుచుఁ గాలము గడపుచుండె.

అద్ధరావరకుమారు లిరువురు దినదినప్రవర్ధమాను లగుచుండ, ధ్రువుఁ డయిదేండ్లప్రాయమువాఁ డయ్యె. కొండొకనాఁడు భూవిభుం డుత్తముని దనతొడపై నిడుకొని యుపలాలనము సేయుచు సురుచిం గూడి వినోదలీలలఁ దేలియాడుచుండె. అందందు ఖేలనాయత్తచిత్తమునఁ దిరుగాడుధ్రువుండచ్చటికి వచ్చి యామచ్చటం గాంచె. తోడనే తానుగూడ జనకునియంకభాగమునం దధివసింపవలయు ననెడి కుతూహలము డెంగమున సంకడింపఁ దండ్రిమ్రోలఁ జిందులాడఁ దొడంగె. సప్రేమదృష్టులఁ దండ్రిపై నిగిడించుచుఁ దదంకారోహణాపేక్షచేఁ జిడుముడివడుచు బాలమృణాళకాండములం బోలుమృదుహస్తముల నాడించుచుఁ జూపులం దీనత్వంబు దోఁపఁ దిలకించుధ్రువునిఁ గాంచియు నాదరింప కుపేక్షించిన విభునిసేఁతలకు గర్వించి సవతికొడుకు నుద్దేశించి సురుచి యిట్లు లనియె.

“ధ్రువా! నీసంభ్రమంబునకుఁ గారణ మూరసితి. తండ్రిగారియూరుభాగమును జేర సర్హాండవేని నాగర్భమునసే జనియించియుందువు. సవతిగర్భమున నుద్భవించినయభాగ్యునకుఁ దండ్రితొడపై నెక్కుభాగ్య మెక్కరణి లభియించు? కొఱనోములు నోఁచిన నీ వేడ? తండ్రియంక మేడ? అయినను పట్టికోర్కె గాఢముగ జనియించెనేని యధోక్షజునిపాదరాజీవముల నాశ్రయింపుము. కరుణాసింధుం డగుభక్తమందారుఁడు వెండియు నిన్ను మదీయగర్భంబునఁ బుట్టించు.”

ఇట్లు మర్మములను దూలించు పినతల్లి దుస్సహావచనములఁ జెవులార వినియు జనకుఁ డౌదార్పకుండె.

ధ్రువుండు పసిపాప యైన నాత్మగౌరవమున శతవృద్ధుం దిరస్కరింపఁ గలవాఁడు. జనకునిసన్నిధానమునఁ దన యీడు పాపఁ డగుసోదరునిముంగల సవతితల్లి యాడెడు దుర్భాష లాతఁడు సహింపఁ జాలఁ డయ్యె. అభిమానధనుఁ డగు నబ్బాలవీరుఁడు దండతాడితభుజగంబువోలె మండిపడఁ జొచ్చె. పరాభవాగ్నిచేఁ బ్రజ్వరిల్లు పంచాబ్దంబుల బాల పంచాననునినేత్రములకు శోకదేవత స్వాగత మిచ్చె. చేయు నది లేక పెద్దపెట్టున రోదనము సేయుచుఁ గ్రోధానలజ్వాలికల నుపశమింపఁజేయు కన్నీ రోడికలు గట్టి గండభాగమునఁ బ్రవహింపఁ బరుగువాఱుచు నాతఁడు దల్లిని సమీపించె. వసవి వసవి యేడ్చుచుఁ జెంతఁ జేరిన కుమారశేఖరుని నాపె చేరఁ దిగిచి యొడిలో నిడుకొని మోము నివురుచుఁ జెబుకంబు పుణుకుచుఁ బరిదేవనకారణ మారయుచుండునంత, నంతఃపుర పరిచారికాజనంబులు సమీపించి యయ్యుదంతము సాంతముగ నాపెకు నివేదించిరి. సవతియీసడింపులు వినినయంతనే సునీతిదేవికి హృదయకుహరము వ్రయ్యలై శోకస్రవంతి పాయలై ప్రవహింపఁ దొడంగె. నిట్టూర్పు లెగయఁ జొచ్చె. సవతి యాడిన సూడుమాటలు సారెసారెకుఁ దలంపునకు రా గోడుగుడుచుచు దుఃఖాగ్నిశిఖలచేఁ గనుగంది వన్నె దఱిఁగిన మాధవీలతికవోలె నాపె జూపట్టుచుండె. ఇవ్విధంబునఁ గొంత

వడి వాపోయి పొంగిపొరలు శోకస్రవంతిని భావసముద్రమున సంగమింపఁ జేసి ధ్రువునిదీనాననమును విలోకించి యిట్లు లనియె. "ముద్దులపట్టీ! ఊఱడిల్లు మూఱడిల్లుము. శోకము వలనం బ్రయోజన మేమి? జీవసంతతికిఁ దొల్లింటికర్మఫల మనుభవింపక తీరదు. వారివారికర్మసూత్రములఁబట్టి మను జులు శుభాశుభఫలముల ననుభవించుచుందురు. వేయేల? నీవు దైవోపహతుండ వగుటంజేసి కాదె భర్తచే నికృష్ట దాసిగా నైనఁ బరిగణింపఁబడని నిర్భాగ్యకుక్షి నుదయిం చితివి. కావున సురుచిమాటలకు వెతఁ గుందఁ దగదు. తండ్రి చేష్టలకుఁ దల్లడిలను గూడదు. ముమ్మాటికిని నేను దురదృష్ట వంతురాలను. నీవో హతభాగ్యుఁడవు. వత్సా! దురపిల్లకుము. పినతల్లి యైన సురుచివచనంబులు సత్యంబులే యగు. ఇంకను జనకుని యంకభాగముపై నిశ్శంకముగ వసియింపఁ గాంక్ష గల దేని సురుచియాదేశము ననుసరించి సర్వశరణ్యుం డగు హరిచరణము లాశ్రయింపుము. దాన సకలశుభంబు లొద వుటయే గాక నీమనోభీప్సితంబును సిద్ధించెడు. విపదంబుధిని మునింగి దరి గానలేని దుఃఖభాగులకుఁ బరంధాముని పద సేవయే నావ. మఱియు విశ్వంభరాపాలనమునకై పద్మ గర్భుఁడు నారాయణుని పాదనలినముల సేవించి బ్రహ్మపదంబు నందె. సర్వాంతర్యామి యగు నమ్మహాత్మునికరుణారసవృష్టి కతంబున మనుఁడు మీతాత నిరవధికయాగఫలంబుల నను భవించి ప్రఖ్యాతయశుండై యిహపరంబులఁ జూఱగొనిన

వాఁడు. నీవు గూడ నారమాకాంతుని పదపంకేరుహంబులకుఁ బ్రణమిల్లి సల్లలిత ప్రతాపుండవు గమ్ము." పరమార్థ ప్రతిపాద కంబు లగు తల్లివాక్కులయందు గుఱి నిల్పి ధ్రువుం డామె వలన నాశీర్వాదముల నంది యరవిందగర్భముఖగీర్వాణుల కును లక్ష్మీతరుణీమణికి నన్వేష్టవ్యుఁ డగు పరమేశుని నన్వే షించి సేవించుటకై గహనాంతరసీమలకుఁ బయనం బగు చుండె. బాపురే! పరాభవానలమున మ్రంది కుందు పసి పాపలు ధీరస్వాంతు లగుటకై ప్రోత్సహించి ప్రఖ్యాతయశో వల్లరులచే జీవితకుసుమములఁ బిసాళింపఁ జేయు వీరమాతల ధీరవృత్తి నెంతని కొనియాడఁ గలము?

అత్తఱిఁ జతుర్దశభువనసంచారియుఁ ద్రికాలసంవేదియు నగు నారదమౌని సర్వ మెఱింగి మధ్యేమార్గమున నబ్బాలకుని సమీపించి సకలపాపనాశనకరం బైన తనహస్తంబున ధ్రువుని మస్తక మంటి మానభంగము సహింపని క్షత్రియార్భకుల ప్రభావమున కక్కజ మందుచు నబ్బాలు నుద్దేశించి యిట్టు లనియె. "ఓయీ! రాజార్భకా! ఎందుల కీసాహసము? నిత్య లక్ష్మీనివాసమై తనరునావాసమును వీడి త్రిదివసదృశంబు లగు మహైశ్వర్యములఁ బాసి యేకాకివై కాంతారములఁ బరి భ్రమించి శ్రమంపడ నేల? సంరంభ ముడుగుము." అనవుడు ధ్రువుండు హృదయవిదారణము లగుసవతిమాతృపరాభవా నలదారుణకీలల నీశ్వరానుగ్రహసుధారసవృష్టిం జల్లార్చుకొనఁ బోదు నని దేవమౌనికి విన్నవించె. నిర్భరానందమున నుగ్గ

డించు నబ్బాలభక్తునియుక్తుల కలరి నారదుం డిట్టు లనియె. “ఓహో! బాలకా! నిరంతరము బాలక్రీడల వర్తించు లేఁబ్రాయమున మానావమానవిమర్శన మేల? ప్రాణుల కాత్మీయకర్మఫలంబు లనూచితంబుగఁ బ్రాప్తంబు లగు. అవ్వానికై విజ్ఞు లగు పూరుషులు ఖేదమోదంబుల సరిగఁ బొందుదురు. అదియునుం గాక మాతృనియోగానుసరణంబుగ సర్వేశ్వరానుగ్రహంబునకుఁ బాత్రుండ వగుదు నంటి వేని జన్మపరంపరాగతవాసనలతో నిష్కామకర్మమున సమాధినిష్ఠల దీపించు యోగీంద్రు లేని యందఁగా రాని పరంధాముని నీక్రియఁ బొందనేర్తువు? వాని నారాధించి కనుంగొనుట కష్టైకసాధ్యము. కావున నీయుద్యోగమును వదలి వివేకమతి వయి తండ్రికడ నిలిచి దైవప్రసాదము లని కలిమిలేముల స్వీకరించి విమల విజ్ఞానవర్తివై వర్తింపుము.” గుణాఢ్యుని గాంచి యానందించుచు నభాగ్యుం డగువానిఁ దెసఁ గరుణ చూపుచు సమునితో మైత్రి నెఱపి వర్తించువానిని దాపత్రయాదికము లంట నేరవని బోధించు మానివరేణ్యుం గాంచి ధ్రువుం “డనఘా! యంతటిశాంతిపథంబు సుఖదుఃఖోపహతులకు సిద్ధింప నేరదని కృపాలుఁడ వగునీవలన వింటి. నే నుత్తమక్షత్రియవంశసంజాతుఁడ. సురుచి యాడినదుర్భాషాఘనశరంబులు హృద్గతములై కరంబు గాఱియవెట్టుచున్నవి. దానం జేసి మదీయచిత్తశాంతి స్థానభ్రంశము నొందె. మునీంద్రా! త్రిభువనోత్కృష్టమై యనన్యసాధ్యంబై యొప్పుసాధుమార్గ మెఱింగించి

తరింపఁ జేయుము. బ్రహ్మాయూరువున జనించి యంచితవిపంచీ వాదనకుశలుండవై లోకకళ్యాణమును గాంక్షించి యెక్కుని చంకమునఁ దిరుగుచుందువు. నీ వెఱుంగని ధర్మరహస్యంబు కలదే?" యని ప్రార్థించి మిన్నకుండె. ధ్రువునిదెండము సంకలితశుభప్రారంభము మేరుభూధరముక్రియ సుస్థిరం బని తలంచి మునివరుం డాతని గాంచి "కుమారవీరా! నిన్నీమార్గమునకుఁ బ్రేరేచినవాఁడు దీనజనమందారుం డగునారాయణుఁడు. సకలపురుషార్థములఁ గోరుపూరుషునకు హరిపాద సరోజయుగళంబె శరణ్యంబు. యమునానదీతీరంబున మధువనంబు హరిసంచారంబుకతమ్మునఁ బవిత్రమ్మును బుణ్యప్రదమ్మునై యలరారుచుండు. నీ వందుల కేగి యాశ్రైవలిసీ పావనతోయంబులఁ గ్రుంకులిడి హరిపదధ్యానప్రవణ చిత్తుఁడవై యమ్మహాత్ముని భజియింపుము. నీ వనుపనీతుండ వగుటం జేసి వేదాధ్యయనాద్యుచితకర్తంబుల కనర్హుండవు. అయిన నయ్యది భక్తిమార్గావలంబుల కవరోధ మొనంగఁ జాలదు. కల్పితాస్తరణుండవై స్వస్తిప్రముఖాసనోపవిష్టుండ వగుచు ధ్యానపరాయణుండవు గమ్ము. మఱియు నాశ్రిత వత్సలుండు సుందరహరినీలసన్నిభాంగుండు శ్రీవత్సలక్షణ లక్షితుండు లలితకాంచననూపురాలంకృతుండు సర్వలోకశర ణ్యుండుఁ బీతాంబరధరుండు నగు శ్రీహరి నీకు దర్శనీయుండు. పరమనివృత్తిమార్గమున లభ్యం బగు పురుషోత్తమునిదివ్య మంగళస్వరూప మొక్కవరి చిత్తమున హత్తెనేని మగుడ

వెనుదిరుగనేరదు. ప్రణవయుక్తంబును ద్వాదశాక్షరకలితంబును దేశకాలవిభాగవేదియునై బుధానుష్ఠితం బగువాసుదేవమంత్రం బొండు గలదు. అమ్మంత్రరాజంబును సప్తవాసరంబులు పఠియించినమాత్రమున ఖేచరాలిం గనుంగొను సామర్థ్యం బలవడు. మాయాభిభూతులు గాక సేవించువారికి సర్వాభిమతార్థసంసిద్ధి యయ్యెడు" నని తద్రహస్యముల నెల్ల నామూలాగ్రముగ నుపదేశించె. అందుల కాసునీతినందనుఁడు డెందమున హర్షాంబుధి నోలలాడి నారదమునీంద్రునకుఁ బ్రదక్షిణపూర్వకనమస్కృతు లొనరించి వానిచే ధన్యవాదములం బడసి మునిజనసేవ్యం బగుమధువనంబునకుం బోయె.

అనంతర మానలినసంభవసంభూతుఁ డుత్తానపాదనరేంద్రుని సమీపించి వానిచే సముచితపూజనములం బడసి సంప్రీతచిత్తుండై మార్గపరిశ్రాంతి నపనయించుకొనువాఁడుం బోలె కొండొకవడి నిలిచి యంతట తేనివంకఁ దిరిగి యాతని మొగము చెన్ను దఱిఁగి యుండుటం జూచి తత్కారణ మారయఁ గోరె. సుపుత్రునివియోగక్లేశభరమున నుత్తలమందుచున్నచిత్తము మునీంద్రునియుపలాలనంబుకతంబున ద్రవీభూతం బయ్యె. బాష్పవారి దృష్టినిరోధం బొనరించుచుండె. డగ్గుత్తికతో రాజు మునిరాజుం గాంచి "మునివర్యా! ఏ మని వాకొన నేర్తు? పరితాపకారణ మెట్లుగ్గడింతు? సుగుణాలవాలుఁ డగు బాలుఁడు సరసవదనసౌంద్రుఁడు పంచాబ్దములవాఁడు మదీయతనూజాతుఁడు మందబుది నగునాచేతి

పరాభవమునకుఁ దాళ నోడి యడవులఁ బట్టి పోయె. మనః
క్లేశకలితుఁడై, క్షుధానలపీడితుం డయి ఘోరాటవులం
గ్రుమ్మఱునాపసికూన భయంకరవ్యాఘ్రభల్లూకాదివన్యమృగ
శ్రేణివదనగహ్వరములనుండి వెండియు బయలువెడలునే!
మునికులతిలకా! అంగనాసక్తచిత్తుఁడనై యుత్తమోత్తముఁ
డగునబ్బాలుఁ డంకపీఠి నధివసింప రా నిరాకరించి భంగపడిన
వెంగలివిత్తును. అక్కటా! మదీయదురాగతమునకు మేర
గలదే!" యని వాపోవఁ దొడంగె. అత్తెఱంగున దిగు
లొంది వగఁగుందునరనాథునిం గూర్చి నారదుండు
"రాజేంద్రా! వగపేల? ఊఱడిల్లుము. నీచేఁ బరిభూతి నందిన
ప్రియనందనుఁడు మందుండు గానోపఁడు. అతఁడు రాజీవ
దళాక్షునిచే రక్షితుఁడై సుధ్రువం బగుకీర్తివిభవంబుచేఁ దేజ
రిల్లఁగలవాఁడు. తులసీదళదామునిఁ భజియించి లోకపాలుర
కందఁగారాని నిత్యపదంబునఁ బ్రభుశ్రీలతో విలసిల్లు. శోకం
బుడిగి సుఖం బుండుము. కతిపయవాసరంబుల కానుగుణ
రత్నాకరుం డిటకు సురక్షితుండై రాఁగలవాఁడు. వైళంబ
శుభంబు నీకూరెడుఁ గావుత" మని యాశీర్వదించి ముని
పనివినియె. పిమ్మట నాభూకాంతుఁడు వదింబడిగ నారదు
వచనప్రకారమును దలపోయుచు రాజ్యకాంక్షను వీడి
ప్రొద్దులు పుచ్చుచుండె.

అట ధ్రువుండును నారదప్రబోధితుండై దేవమాని
వర్ణితంబును సమస్తపుణ్యానిలయంబును నై యొప్పారుమధు

వనంబు డాయంజని యమునాతరంగిణిని గ్రుంకులిడి సమాహితచిత్తమున ధ్యానసమాధిం బ్రవేశించె. ప్రారంభమున నాతఁడు త్రిరాత్రోపవాసంబు లొనరించుచుఁ గపిత్థబదరీఫల పారణంబునఁ బ్రాణధారణము గావించుకొనుచుఁ బ్రథమ మాసము హరిధ్యానమునఁ గడపె. రెండవమాసంబున నాఱేసి దివసంబుల కొకమాఱు జీర్ణతృణపర్ణాహారుండై విష్ణుసమారాధనం బొనరించె. పిమ్మట నవరాత్రంబుల కొకపరి సలిల భక్షణంబు సేయుచు మూఁడవనెల మాధవు నర్చించె. చతుర్థమాసంబున ద్వాదశదివసంబుల కొకతోయము వాయుభక్షణము గావించి జితశ్వాసుండై పుండరీకాక్షునిఁ బూజించె. పంచమాసమున నిరుచ్ఛ్వాసుండై చేతనారహితం బగుస్థాణువు క్రియ నేకపదంబున నిలిచి పరమాత్ముని సేవించె. పదంపడి యాతఁడు విషయవాంఛలకుఁ జోటీయక జగదాధారుం డగునారాయణుండే శాశ్వతపరబ్రహ్మం బని హృదయపీఠిని బాదుకొల్పి తదన్య మెఱుంగక హరిస్వరూపమున లీనమై యుండె. అబ్బాలకునియంగుష్ఠపీడనమున భూరిమద వారణాధిష్ఠితంబై సాగరతరంగమాలికల నూఁగాడుపోత మట్లు ధారుణీతల మల్లలనాడఁ దొడంగె. ముల్లోకవాసు లుఱ్ఱూఁతలూఁగిరి. చరాచరాత్మకం బగు ప్రపంచమునంతను గర్భకుహరమున దాఁచుకొనినరమానాథుఁడే ధ్రువునితపోబలంబునఁ జలనమందిననాఁడు తక్కుంగలవారియిక్కట్టులు లెక్కింపనేటికి! ప్రాణనిరోధంబున దేవతానీకము తాళఁజాలక భగ

వానిని జేరి ముకుళితహస్తులై "ప్రభూ! శరణార్థులము ఆర్తి హరించి కావవే" యని మొఱవెట్టఁ దొడంగ. శ్రీహరి వారియెడల సుప్రసన్నుండై తత్కారణము సర్వ మెఱింగించి కుందు వాపి వారి వారియావాసంబుల కంపి గరుడవాహనారూఢుండై మధువనంబునఁ దపం బొనరించుధ్రువునియెదుట సాక్షాత్కరించె.

అంత ధ్రువునిమనోంబుజమునఁ దాండవమాడుతటిత్ప్రభాయతమూర్తి తిరోహితుం డయ్యె. భక్తావతంసునినేత్రద్వంద్వము చలన మందె. తోడ్తోన యతని ప్రఫుల్లనయనప్రసారము కట్టెదుట నిలిచినవైజయంతీమాలికాశోభితునిపై, చతుర్భుజునిపైఁ బ్రసరించె. అంత నాతఁ డుత్తరక్షణముననే యమ్మహామూర్తికిఁ బ్రణమిల్లి కృతాంజలియై యవ్విరాడ్విగ్రహుని స్తుతియింపఁ బ్రయత్నించి స్తుతిక్రియాకరణదక్షుండు గానేరక నివ్వెరపాటుతో నిలిచి వీక్షించుచుండె. అక్కఱెఱింగినబాలగోపాలమౌళి వేదమయం బగుశంఖమున నిర్భరానందముతో నయ్యర్భకునికపోలతల మంటె. తోడనే గంగాఝురీసంకాశం బగు స్తోత్రస్రవంతి బయలువెడలె. దానంజేసి యబ్బాలభక్తుండు శ్రీకాంతు నివ్విధంబున వినుతింపఁ దొడంగె.

"దేవాదిదేవా! నీవు సర్వభూతాత్ముండవు. లోకవృత్త మంతయు భవదీయేచ్ఛామాత్రంబున వర్తించుచున్నయది. సమాధినిష్ఠం బడలినయింద్రియాళిని నీయూర్పుగాడ్పుల నుజ్జీవింపఁ జేసినజగత్ప్రాణుండవు. దీనబంధూ! దాసుని

వందనము లందికొనుము. ఏకేశ్వరుండ వయ్యు మాయాఖ్యం బగునాత్మీయశక్తిం జేసి దారువులయందలివహ్నిచందమున వివిధరీతులఁ బ్రకాశించుచుందువు. సకాము లయినదీనులను గోవత్సన్యాయమునఁ బోషించునీకృపావిశేషం బేమని కొనియాడ నేర్తు?

మ. అరవిందోదర తావకీనచరణధ్యానానురాగోల్లస
చ్చరితాకర్ణనజాతభూరిసుఖముల్ సానందకబ్రహ్మమం
దరయన్ లే వఁట, దండభృద్భటవిమానాకీర్ణులై కూలు నా
సురలోకస్థులఁ జెప్ప నేల సుజనస్తోమైకచింతామణీ.

చ. హరిభజనీయమార్గనియతాత్మకులై భవదీయరూపమై
పఱలినభక్తియుక్తు లగువారలసంగతిఁ గల్గఁజేయుస
త్పురుషసుసంగతిన్ వ్యసనదుర్భరసాగర మప్రయత్నతన్
సరసభవత్కథామృతరసంబున మత్తుఁడనై తరించెదన్.

సీ. సర్వేశ కల్పాంతసమయంబునందు నీ యఖిలప్రపంచంబు సాహరించి
యనయంబు శేషసహాయుఁడవై శేషపర్యంకతలమునఁ బవ్వళించి
యోగనిద్రారతినుండి నాభిసింధుజస్వర్ణలోకకంజాతకర్ణి
కందుఁ జతుర్ముఖు నమరఁ బుట్టించుచు గుచి నొప్పు బ్రహ్మస్వరూపి వైన

గీ. నీకు మ్రొక్కెద నత్యంతనియమ మొప్ప
భవ్యచారిత్ర పంకజపత్రనేత్ర
చిరశుభాకార నిత్యలక్ష్మీవిహార
యవ్యయానంద గోవింద హరి ముకుంద.

ఇట్లు పెద్దయుంబ్రొద్దు ధ్రువునిచే వినుతింపఁబడి భగవంతుండు భృత్యానురక్తుండై యింతిం తనరాని సంతసమున

"వత్సా! నీధీరవ్రతమున కానంద మొందితి. బాలప్రాయమున సాధుజనదుర్లభం బగు నియక్షీణదీక్షాచరణంబునకు నిరవధికభక్తిప్రభావంబునకు నచ్చెరువందితి. నీమనోభీప్సిత మెఱింగితి. సప్తర్షిమండలము దారకాసమేతమై వలగొనఁ దగునట్టియు దురాపంబును ననన్యాధిష్ఠితంబును బ్రళయావసానంబునం దైన నశ్వరంబు గాక వెలుంగునదియు నైన ధ్రువక్షితి యనుపదం బిరువదియాఱువేలేండ్లు చనినపిదప నీకుఁ బ్రాప్తంబు కాఁగలదు. ఆతదనుక వనవాసగతుం డైన నీతండ్రి రాజ్యమును బూజ్యముగఁ బాలింపఁ గలవు. మృగయాకౌతుకంబున భవదనుజుం డగు నుత్తముండు ఘోరాటవులం గ్రుమ్మరి మృతుం డయ్యెను. కుమారాన్వేషణార్థమై కాంతారములు పట్టి వానిమాతయు భీత్యావహం బగు వీతిహోత్రశిఖలచే రూపు మాయు. ఓయీ! ధ్రువకుమారా! న్యాయధర్మములం బెడబాయని రాజ్యపాలనంబున నిహసుఖంబులు దనివార ననుభవింపుము. యజ్ఞస్వరూపుండ నగు నన్ను సంపూర్ణదక్షిణలతోఁ గూడిన మఖంబు లొనరించి సంతుష్టునిఁ గావింపుము. చరమకాలంబున మదీయనామసంకీర్తనంబు చేసి పునరావృత్తిరహితం బగు శాంతిపదంబును బొంద గలాఁడ" వని యభిమతార్థంబు లనుగ్రహించి ఖగవాహనుండు వైకుంఠంబునకుం జనియె.

అనంతర మానరేంద్రనందనుండు యమునాస్రవంతీప్రాంతకాంతారం బగు మధువనంబును వీడి నిజపురాభిముఖుం

డగుచు నాత్మగతంబున "అక్కటకటా! ఎంతలెంతలు వింతలు పుట్టె! నే నభిలషించుచున్న తపంబువలన నాకనివాసులకు సంభవించు నంతరాయ మేపాటిది? వారిచేతలనే నామది గలుషితం బైనది. సనక సనందనాది యోగీంద్రబృందము జితేంద్రియత్వమునఁ బెక్కువేలేండ్లు యోగసమాధులఁ నిలిచి ముకుందచరణారవిందములఁ గాంచి తరియించుచుందురు. అట్టితఱి నేను షణ్మాసంబుల వానియనుగ్రహంబునకుఁ బాత్రుండ నయ్యు నిరర్థకంబులై యశ్వత్థంబు లగు నర్థంబుల నర్థించి వ్యర్థమనోరథుఁడ నైతి. ఛాపుగే! ననుఁ బోలు మూఢమానసులు ధాత్రిపై నుందురోటు? పెక్కులేల? నారదమునీంద్రులవాక్యసరణి తథ్యంబ యగు" నని తలపోయుచుండె.

అవ్విధంబున స్వగృహాభిముఖుం డగు ధ్రువుని శుభాదంతము కర్ణరసాయనంబుగ నుత్తానపాదునకుఁ దెలియవచ్చె. కాని యాతఁడు కుమారశేఖరుండు మగుడి వచ్చుట చచ్చిన వారలు లేచి వచ్చుట వంటి దని తలంప సాగె. మందభాగ్యునకు శుభప్రతిపాదన మెక్కడి నొడఁగూడు నని వితర్కింపఁ బూనె. వెండియు మునివాక్యములు స్మరణకు వచ్చి యాశాంకురములు తలసూప సాగె. తోడనే సుతునిరాక నివేదించిన మతిమంతున కతులితదివ్యభూషణాంబరశ్రేణి నొసంగి బంధుజనామాత్యపరివృతుండై తాఁ నెదురునరిగె. అవ్విధంబునఁ గొంతదవ్వేగుసరికి రమాకళత్రచరణారవిందయుగళార్చనా

పరుం డగు కుమారశేఖరుంను గన్నులకఱవు దీఱ సాక్షాత్క రించె. తోలఁకాదు ప్రేమభరంబున మేనఁ బులకాంకురంబులు మొలకెత్త రాజు సుతునిఁ బొదివిపట్టి మోము నివిరి శిరము మూర్కొని చుబుకంబు పుణికి యవ్యయానంద బాష్పధారల నభిషిక్తుం జేసి యాశీర్వదించె. అంతఁ జిరయశుం డగు ధ్రువుండు ప్రమోదితాత్ముం డగుచుఁ దండ్రికిఁ బ్రణతు లొనరించె. పదంపడి తల్లులచరణాంబురుహంబులు ఫాలతలంబు సోఁక మ్రొక్కులిడి నిలిచినయక్కుమారవీరుని జేఁదిగిచి సురుచి పూర్వవైరమును బాటింపక చిరంజీవివి కమ్మని దీవించె. మాత యగు సునీతి ప్రేమజలధి చెలియలికట్టను ద్రెంచుకొని పొంగిపొరలె. వార లెల్లఱుఁ గొంతతడవు సంతతానందమయ మగు ప్రేమరాజ్యమును బాలింప సాగిరి. పౌరజనాళి వీరమాత యగు సునీతిదేవిం గాంచి "తల్లీ! నీపూర్వభాగధేయము సుపుత్రరూపమున నేత్రపర్వం బొనరించుచున్నది. ప్రణతార్తిహరుం డగు నబ్జనాభుం డివ్విధంబున మీచేఁ బూజితుం డగుచున్నవాఁడు. ఇమ్మహాభక్తునికరంబున ధరామండలం బెల్ల దంబు మీఱఁ జిరకాలము రక్షితం బయ్యెడుఁ గావుత" మని దీవనలు వెట్టిరి. ధ్రువకుమారుండు భ్రాతృసహితుండై వారణేంద్రంబుపై నధివసించి నగరాభిగమనుం డయ్యె.

పురగోపురావళులును, కుడ్యద్వారవారములును స్వర్ణకాంతు లీనుచుండె. రంభాస్తంభములు పుష్పమంజరీకలితము

లై సంశోభించుచుండె. విపణిమార్గములు ఘనసారకస్తూరికా గంధజలబంధురంబులై రాణించుచుండె. గృహప్రాంగణములు నవరత్నమయరంగవల్లివిరాజమానంబులై కర ముద్దీపించుచుండె. నగరోపకంఠమునందలి యుద్యానవనతరుచ్ఛాయల నాశ్రయించిన శుకపికమిథునాళి యవ్యక్తమధురగానములతో ధ్రువకుమారునకు సుస్వాగత మొసంగుచుండె. ధ్రువుండు రాజమార్గమున నిర్గమించుతఱి,

మ. హరిమధ్యల్ పురకామినీజనులు సౌధాగ్రంబులం దుండి భా
స్వరసిద్ధార్థఫలాక్షతప్రసవమాల్యవ్రాతదధ్యంబువుల్
కరవల్లీమణిహేమకంకణఝణత్కారంబు శోభిల్లఁ జ
ల్లిరి యాభాగవతోత్తమోత్తమునిపై లీలాప్రమేయంబుగన్.

ఉత్తానపాదుఁ డిట్లతివైభవంబునఁ గుమారునిం గూడి జగజ్జేగీయమానప్రభలతో విరాజిలురాజసౌధంబు నింద్రుం డమరావతిం బోలె నలంకరించె. ఇప్పగిదిఁ బురప్రవేశం బొనరించినరాజర్షి యగు నుత్తానపాదుఁడు హర్షోత్కర్షంబులు మనంబున ఘనంబుగఁ బెనఁగొన నక్కుమారతల్లజునిప్రభావవిభవాతిశయంబులు గనుంగొని నయనకల్హారము లానంద మరందబిందుసందోహములఁ జెమ్మగిల్ల నుమ్మలికమ్ము మాని యవ్యయానందంబునఁ గాల మేగించుచుండె. ధ్రువకుమారుండును సర్వజనానందసంధాయియై నవనవోన్మేషయౌవనమునఁ బౌరజననయనచకోరములకుఁ బార్వణచంద్రబింబమై దీపించుచుండె. మాకుమారునికరణి రాణించునిజకుమారవరునిఁ గాంచి చిత

మున రేకొత్తినయానందమున నాతని సామ్రాజ్యాభిషిక్తుం జేసి యుత్తరవయఃకాలంబున శాంతచిత్తముతో నాత్మగతిం బొందఁ గృతనిశ్చయుండై వృద్ధభూపతి వానప్రస్థవృత్తి నవలంబించె.

రాజ్యలక్ష్మిని చేపట్టిననాఁటినుండియు ధ్రువుండు ప్రజల నాత్మప్రజలంబోలెఁ బోషించి పాలించుచు రూపొందిన ధర్మదేవత నాఁ బౌరజనాళిచే మన్ననల నందుచుండె. అనంతర మాధరాతలేంద్రుండు శింశుమారప్రజాపతికిఁ గూఁతురైన భ్రమి యనునారీమణిని బరిణయంబై దానివలన సంతాన ఫలముల బొందె. వెండియు వాయుపుత్రికయైన ఇల యను కాంతాలలామను స్వీకరించి యుత్కలనామకుం డను నొక్క కుమారవరుని ననమానరూపలావణ్యాతిశయంబులఁ బరిఢవిల్లునొక్క కన్యారత్నమును గాంచె. ధ్రువమ్మాతలేంద్రుని భ్రాత యగు సుత్తముఁడు వివాహయోగంబు లేకయే మృగయా వినోదార్థము హిమవన్నగప్రాంతకాంతారంబులఁ గ్రుమ్మరుచు నొక్క యక్షకులసంజాతునిచే నిహతుం డయ్యె. వానిమాత యగుసురుచియు నీవార్తచే నార్తిఁ గుందుచు వనవీథులం బడి పరిభ్రమించుచు దావపావకశిఖల కాహుతి యయ్యె.

ధ్రువుండు భ్రాతృమరణసంజనితశోకవ్యాకులచిత్తమున నుగ్రుండై బాణాసనము పాణితలమ్మున సంధించి జైత్రం బను రథం బెక్కి యుత్తరాభిముఖుండై చని హిమవద్ద్రోణియందు గుహ్యకవాసం బయినయలకాపురంబు బొడఁగని యాపురోప

కంఠమున విడిసి మహోద్రేకంబున శంఖమును బూరించె. ఆశంఖారావము భయంకరధ్వానము లీనుచు దిగంతంబుల నిండి యక్షకాంతలగుండియలు ప్రీలం జేసె. యక్షభటాళి రిపుం డెవ్వఁడో తమపురిం దాఁకె నని సమరోత్సాహంబు సంధిల్ల. వివిధాయుధోపేతులై రొక్కుమ్మడి వానిం జుట్టు ముట్టిరి. అంత నమ్మహారథుం డగుధ్రువుండు దుర్నిరీక్ష ప్రతా పంబున విజృంభించి తన్నలమికొనిన పదుమూఁడువేలసేనా సముదయంబులఁ జీరికిం గొనక, చిచ్చఱపిడుగట్లు నిశితశర పరంపరలఁ బిలుకుమార్చె. యక్షులంద అమ్మహోదారుపరా క్రమప్రకటధైర్యశరలాఘవంబును బలుమాఱు నుతించుచు రోషకషాయితాక్షులై ప్రామ్మని డీకొని వానిపై శరవర్షంబులు గురియించిరి. అత్తఱి నాతఁడు మబ్బులమాటున డాఁగు గుబ్బలివడువున నేమి చేయుటకు దోఁపక పెంపఱియుండె. సిద్ధగణంబులు మింటం గంపించుచు హాహాకారంబు లెగయ ధ్రువపయోరుహహితుండు దైత్యసమూహార్ణవమందు మునింగె నని చింతింప సాగిరి. ఆపోటుమానిసిం గెలిచితిమి గెలిచితి మని యక్షవీరు లెల్లరు నుల్లములం బెల్లుగ సంతసిల్లి గేలి రొనర్పం బూనిరి.

అంత ధ్రువుండు హిమకణంబులఁ దూలించుప్రచండ మార్తాండునిభంగి చండకార్ముకమును జే నంధించి వివిధ నారాచపరంపరలచే నరిసేనను బింజపింజలుగఁ దూలించుచు ప్రభంజనుండు మేఘావళిం జాఱఁదోలుగతి యక్షసైన్యములఁ

జించి చెండాడఁ దొడంగె. ధ్రువునిశితబాణఘాతములచే శాత్రవసైన్యనివహంబునఁ బెక్కండ్రు వికలాంగు లయిరి. మణిగణస్థగితకిరీటములతో నొప్పారునాదలలతోడను, సముజ్జ్వలమణికంకణాదులచే విరాజమానం బగు భుజనికరముతోడను రణరంగము వీరమనోహరాకృతిం బూని రమ్యం బయి తనరారుచుండె. మణిగణదీపితం బగు రుధిరప్రవాహము వింతకాంతుల నీనుచు భూతసంతతులకు విందొనరించుచుండె.

యక్షసైన్యనికాయంబున హతశేషులు సమరవిముఖులై హరిరాజమును గాంచి పరుగిడుమదకరీంద్రబృందమట్లు పలాయితులు కాఁజొచ్చిరి. రాక్షసమాయలను గప్పియున్న ధ్రువుండు వారికార్యవిధాన మెఱుంగ నేరక సారథిం గని "సారథీ! యిబ్భూతలంబున మాయావులకృత్యము లెఱుంగ నెవ్వ రోపుదురు!" అని వచియించి తత్పురప్రవేశంబునకుఁ ద్వారపడునంత నప్పురవరంబులు గానరాకుండుటయు నాప్రయత్నమును మాని కర్తవ్య మెఱుంగక కొండొకవడి చింతించుచుండె. అయ్యెడ మహాజలధిఘోషంబు ననుకరించుశబ్దం బొక్కటి యాతనికి శ్రవణగోచరం బయ్యె. మహావాయుసంజనిత మైన రజఃపటలము కకుబంతమ్ముల నాశ్రయించె. గర్జానినదంబు లగుజీమూతవ్రాతము నభోవీథిని భీకరాకారము దాల్చి విహరించుచుండె. ఇట్టివిచిత్రసంఘటనమునకుఁ గారణం బారయుచు నిలిచినధ్రువునిమీఁద రక్కసిమూఁకలు ఘోరవ

మస్తిష్కపురీషమూత్రపలలంబులనుత్తమ్ములు వియత్తలమ్మునసుండి కురిపింపఁ దొడంగిరి. కట్టెదుట మత్తగజవ్యాఘ్రసమూహము లుగ్రమూర్తులఁ దాల్చి దీపించుచుండె. ఉద్భటతరంగానీకమునఁ దుఱంగలించుసముద్రంబును గల్పాంతభీషణం బయినమహాహ్రదంబును ముందువెనుకల దూబూచులాడుచున్నట్లుండె. ఇవ్విధంబున మాయావు లగుయతులచే నవిరళభయంకరంబు లగునసురమాయలు ధ్రువునిపట్లఁ బ్రదర్శితము లగుచుండె.

ఇట్టి భయంకరవైచిత్ర్యములఁ దిలకించి దైత్యమాయావాగురను నిర్గమించుమార్గం బెద్ది యని చిత్తమునఁ దత్తఱపడుచుండిన ధ్రువునిసమక్షమున మునినికాయము ప్రత్యక్షంబై "అనఘాత్మా! లోకపావనం బయిన యెవ్వాని దివ్యనామంబు నాకర్ణించి సంస్మరించినమాత్రంబున భక్తావతంసములు దుస్తరం బైన మృత్యువు నేని సుఖవృత్తిం దరియింప నోపుదురో, యెవ్వానిచిదాకారము సదా మునుబోంట్ల యెదను దేదీప్యమానప్రభలతో నర్తనం బొనరించుచుండునో, యట్టియీశ్వరుఁడు వరుఁడు భక్తజనార్తిహరుం డొక్కరుఁడె నీయార్తిం బరిమార్పఁ గలం" డని యుగ్గడించి నిశేచ్ఛం జనియె. అక్కరణి నానతిచ్చిన మానివరులహితంబును మాఱిఁ దాలిచి కృతాచమనుండై ధ్రువుండు లక్ష్మీవిభుని పాదనలినమ్ముల స్మరియించి మహోగ్రం బగునారాయణాస్త్రంబు గార్ముకమున మంత్రపూర్వకంబుగ సంధించుచు,

విమలం బయినవివేకోదయంబునం జేసి రాగాదికర్మములు సమయుభంగి గుహ్యకమాయాంధకారము దవుదవ్వుల విరిసి పోయె. వెండియు,

మ. వరనారాయణబాణరాజనితదుర్వారప్రభాహేమపుం
ఖరుచిస్ఫారమరాళిరాజనితపక్షక్రూరధారారణ
స్ఫురసాహస్రము లొలి భీషణవిపక్షశ్రేణిపైఁ బ్రాలె భీ
కరరావంబునఁ గావఁ జొచ్చుశిఖిసంఘాతంబుచందంబునన్.

ఇత్తెఱంగున నిశితప్రదీప్తం బగుబాణపరంపరలచే వికలాంగు లయి వెతలొందు పుణ్యజనులు పృథుహేతిపాణులై భూరిభుజగప్రకరంబులు ఖగనాథునిం గాంచి యెదిర్చి పేర్చు చందమునఁ జిత్రరథుని నొక్కపెట్టునఁ జుట్టిముట్టిరి. యట్టిపరివృతుం డగుధ్రువుండు భుజావిజృంభణంబున సింహనాదం బొనరించుచుఁ జండతరకాండమండలమున శాత్రవనివహంబును శాంతిపదంబును బొందించుచుండె.

ఇవ్విధమునఁ జిత్రరథుం డగుధ్రువునిచేఁ బరిమార్పఁబడుచుండిననిరపరాధు లగుగుహ్యకులం జూచి యతనిపితామహుం డయినస్వాయంభువమనువు మునిగణపరివేష్టితుం డయి చనుదెంచి వానిచేఁ బూజితుండై ధ్రువు నుద్దేశించి “వత్సా! శాంతింపుము. శాంతింపుము. భ్రాతృమరణశోకసంజనితరోషకషాయితాత్ముండవై నిరపరాధు లయినవీరిని ద్రోహింపఁ బూనితివి. భూతహింస గావించుట పశుప్రాయు లగుదేహాభిమానులకుం జెల్లుఁ గాని సాధువర్తనులకుం దగదు.

శిశుప్రాయముననే సర్వభూతశ్రేణి నాత్మభావంబునఁ దలంచి నిష్ఠాగరిష్ఠుండవై లోకారాధ్యుం డగుపరంధాముని సేవించి కీర్తి నందినపరమభాగవతాగ్రేసరుఁడవు. భాగవతులచిత్తంబులకుఁ గడుఁ గూర్చువాఁడవు. నీయట్టివాని కిట్టిబెట్టిదపుగార్యములు సేయ సమకట్టుట సంభావ్యం బగుచేతఁ గా నోపదు. కార్యకారణసంభూతరూపం బయిన విశ్వంబున నీభ్రాతృమరణకారణం బేకతంబున నిర్ణయింపఁగలాఁడవు? కర్త్రాధీనము లయిన భూతవ్రాతములు మహావాయువు ననుసరించు రజఃపటలంబుచాడ్పున నస్వతంత్రంబులై యనువర్తించుచుండు. జగత్కారణుం డగుకర్తసాక్షి యీ సృష్టిపాలనవిలయంబులం గర్త కానివాఁడునుం బలెఁ జూపట్టుచుండు. తండ్రీ! ఈయక్షులు నిరపరాధులు. నిర్దోషులు. అవధ్యులు. ఒక్కనికై పెక్కం డ్రిక్కతంబున నని మొనఁ ద్రుంగుట భావ్యంబు కా నేరదు. కుమారవీరా! ఇయ్యది మనకులంబున కనుచితకర్తంబు. భగవానుఁ డనుగ్రహింపఁడు. పంచాబ్దములనాఁ డీసుకోడెగాండ్రలోఁ బినతల్లి యాడినమాటలకుఁ దాళ నోడి జననీజనకుల వీడి కాననాంతరముల ఘోరతపం బొనరించి లోకోత్తరం బయినయున్నతపదంబు నందిన మహాభాగుఁడవు. నీ కీమత్సరం బేల? వత్సా! సర్వశుభహానిమైన రోషంబు మాని రాగద్వేషంబులం దగులంబు వీడి సర్వభూతావాసుండును, నానంద తేజోమయుండును, నవ్యయుండు నగు మాధవునియందుఁ జిత్తమును హత్తించి చిరకీర్తియుతుం

డవు గమ్ము. అనఘా! నీదుసోదరహంతకు లని మదిఁ దలంచి యక్షవారమును వధియించి ముక్కంటి కనుంగునఖుం డయిన కుబేరునకు నపరాధం బొనరించితివి. కావున నీ వాయర్థ విభుని నర్థించి సుప్రసన్నునిగఁ జేసికొను" మని వచియించి ధ్రువునిచే సత్కృతుండై స్వాయంభువుఁడు ఋషిగణయుక్తుం డై యాత్మీయధామమునకుం జనియె.

అంత నాధనదుఁడు యక్షచారణవిద్యాధరదివిజగణ సేవ్యమానుం డయి రోషరహితుం డైన ధ్రువుని సమీపించి కృతాంజలియై "ఓహో! క్షత్రియకుమారా! భవదీయపితా మహుని యాదేశంబుకతంబున దుస్త్యజం బయిన విరోధం బుడిగితివి. అటు గావున నీయందు డెందము ముదం బందెడిని. సృష్టిస్థితిలయంబుల కనయము కాలమె కర్తయై వర్తించు చుండు. కావున నీయనుంగుభ్రాతను నిధనంబు నొందించిన వార లీయక్షవరులు కారు. మఱియు నీవే యకారణంబుగ నీపుణ్యజనానీకమును దునుమాడితి వనియు నొనాడఁ జనదు. ఈశ్వరవిలాసము లనంతములు. మించినకార్యమునకై చింతిం చుట గతజలసేతుబంధనంబ యగు. అనంతామేయశక్తి యుతుం డగు జగదీశ్వరుని సేవింపుము. నిరంతరము నీకు మే లయ్యెడు. నీమానసమిళింద మంబుజనాభపాదారవింద మరందపానంబున మత్తిల్లి మధురగానం బొనరించుట నే నెఱుంగుదు. అట్లగుట నీమనోవాంఛితం బగువరంబు సఫలీ కృతం బయ్యెడు. కావున నెఱింగింపుము. అవశ్యం బనుగ్రహిం

చెద." అనవుఁడు రాజరాజుచేఁ బ్రేరితుం డయి భాగవతోత్తముం డగు ధ్రువుండు "ఏహరిస్మరణంబున నజ్ఞానతమఃపటలము విరియంబాఱునో యట్టిహరిస్మరణంబు తిరంబుగ హృదయంబున నిలుచునట్లు ప్రసాదింపు" మని వేఁడికొనియె. అందుల కాకుబేరుం డట్టులె యయ్యెడుం గాక యని వరం బిడి యంతర్ధాన మొందె.

పిమ్మట ధ్రువుండు దేవగణసంస్తూయమానుం డయి నిజావాసమునకుం బోయి మంగళస్వరూపుం డైన పురుషోత్తమునియందు బుద్ధి నిలిపి ధర్మనిరతిని సేవించుచు దీనవత్సలుం డయి పౌరజనాళిని గన్నబిడ్డలక్రియ నాదరించుచు మేదురంబుగ యశశ్చంద్రికావల్లరులు దిగంతంబుల నెల్ల నల్లుకొనునట్లిరువదియాఱువేలేండ్లు త్రివర్గసాధనంబుగ రాజ్యంబు పాలించి విశ్వం బెల్ల భగవన్మాయారచితం బగు చిత్రపటంబుగా నాత్మఁ దలపోయుచు,

చ. మనువిభుఁ డంత భృత్యజన మంత్రి పురోహిత బంధు మిత్ర సం
దన పశు విత్త రత్న వనితా గృహ రమ్యవిహారశైల వా
రినిధిపరీతభూతలహరిద్వీపముఖ్యపదార్థజాలముల్
[illegible]నమతిచే ననిత్యములుగాఁ దలపోసి విరక్తచిత్తుఁడై.

నిజనందనునకుఁ బట్టంబు గట్టి బదరికావనాంతరసీమకుఁ బయనం బయ్యె. అవ్విధంబునఁ బురంబు వెల్వడి బదరికాప్రాంతశైవలినీపుణ్యతీర్థమునఁ గ్రుంకులిడి పరిశుద్ధాంతఃకరణుండై పద్మాసనంబు వైచికొని, పవనుని బంధించి ముకుళితనేత్రుఁడై పద్మపత్రనేత్రుని భజియించుచుండె.

అవ్విధంబునఁ దపం బొనరించురాజేంద్రునిసముఖము నకు దివ్యప్రభలతో వెలుంగువిమానం బొక్కటి గంభీరఘో షంబున వచ్చి నిలిచె. అందు సర్వలక్షణసంశోభితు లగుపురు షవరేణ్యు లిర్వు రుండిరి. కిరీటాంగదకుండలధారులై తులసీ దామములతో విరాజిలుకౌమారవయస్కులఁ గాంచి విష్ణు దూతలుగా నెఱింగి ధ్రువుండు బద్ధాంజలియై వారిని నమ్ర భావమున సేవించె. పుష్కరనాభభక్తు లయిన యానునంద నందులు సంప్రీతచిత్తులై మందస్మితవదనారవిందు లగుచు ధ్రువునిం గాంచి "ఓయీ! నరేంద్రచంద్రా! నీకు భద్రం బయ్యెడుఁ గావుత. ఆకర్ణింపుము. అయిదేండ్లనాఁడు మేధా నిధివై యుదాత్తతపోవ్రతనిష్ఠం బూని మధుసూదను నంత వానిని బరితృప్తుం జేసిన భక్తావతంసుఁడవు. అద్దేవదేవుఁడు నీయెడఁ బ్రసన్నచిత్తుండై నిన్నుఁ గొనితేరఁ బనుపగా వచ్చిన వారము. మాధవపదసాన్నిధ్యమునకు దయసేయుము. రాజా గ్రణీ! పరమభాగవతోత్తము లెద్దానిని మహోత్తమపదం బని సర్వదా భావించి నుతియించుచుందురో, దేనిని ప్రభా కరసుధాకరతారాగ్రంబులు వలగొనుచుండునో యట్టివిష్ణు పదంబు కరంబు ముదం బొడఁగూర్చెడు రమ్ము. వైశంబ విమానారూఢుండవు గమ్ము." అని వచియించిరి.

అంతట ధ్రువుండు వారియాశీర్వాదములఁ గైకొని విమానంబునకుఁ బ్రదక్షిణార్చన లొనరించి హరిపార్షదు లయిన సునందనందులకు వందనంబులు చేసి హిరణ్మయరూప

మును ధరియించె. తోడనే సురదుందుభులు మ్రోఁగసాగె. కిన్నరకింపురుషాదులవీణాగానము సొంపు నింపుచుండె. విరుల ముసురు గురియఁ దొడంగె. అట్టి శుభోత్కరం బగుపుణ్యావసరంబున ధ్రువక్షితీంద్రుఁడు త్రివిష్టపంబునకుఁ బోవువాఁడై మాతృదేవతను దలంచుకొని యామెను బాసి పో నొల్లక యుల్లమునఁ బెల్లుగఁ జింతిల్ల దొరకొనియె. తద్విచారకారణం బెఱింగిన విష్ణుదూతలు వాని నవలోకించి వేఱొకవిమానంబు నధిరోహించి మునుముం దరుగుచుండిన తజ్జననిం జూపి ధ్రువునికుందు వాపిరి. ఆవింతచెయిదములఁ గాంచి ధ్రువుం డెంతెం తనరానిసంతసమున మంతుకెక్కె. దేవతలు పుష్పవర్షము గురియించుచుండ మాతృవిమానముపిఱుంద విమానారూఢుం డయి చని చని గ్రహమండలంబును, లోకత్రయంబును, సప్తమునిమండలంబును గ్రమంబున నుత్తరించి విష్ణుపరాయణుం డైన ధ్రువుం డవ్వలఁ దనరారు శ్రీహరిపదంబు నంది త్రిలోకచూడామణియై వెలుఁగుచుండె.

అద్దిరా! పంచవర్షప్రాయమున నాత్మగౌరవమునకై వాదులాడినభూధవనందనుఁడు మనోరథసంసిద్ధికై దారుణాటవులం గ్రుమ్మరి యుగ్రతపంబున నీశ్వరానుగ్రహంబు వడసిన బాలభక్తుఁడు, ధరామండలం బెల్లఁ గరాగ్రంబునఁ బాలించి యశము గాంచి మించిన గాశేందుమౌళి, అపవర్గప్రాప్తికై దేవవిమానము స్వాగతం బిడు సుముహూర్తమునఁ దల్లిపాదపద్మముల నుల్లమునఁ దలపోసి భజియించిన మాతృభక్తివరా

యణుఁడు, పాతకలోకము నుల్లములు చల్లవడఁ జేసిన సల్లలిత ప్రతాపచారిత్రుఁడు, ధ్రువుండు విద్యార్థిబృందమున కాదర్శ ప్రాయుఁడై యభిమతార్థముల ననుగ్రహించి యోముఁ గావుత! వెండియు నీధ్రువచరిత్రమును ద్వాదశిని, పద్మబాంధవవాసరమున, శ్రవణనక్షత్రమున, దినక్షయమునందు, సంక్రమణవ్యతీపాతములయందు భక్తిశ్రద్ధలతోఁ బఠియించిన వేస్తులనిస్తులతమఃపాళములు పటాపంచలై శుభం బొనఁగూడుఁ గావుత!



# నారదుఁడు



భరతఖండమునఁ బౌరాణికమహాయుగమునందలి భాగవతకథామృతనిధిని మథియించినచోఁ జరితామృతములు విబుధుల కాప్యాయనంబుగఁ గ్రోల నబ్బఁగలవు. కకుబంతవిశ్రాంతకీర్తిశోభితు లగు పురాణపూరుషుల యత్యద్భుతవర్తనములఁ గన్నులారఁ గాంచి యానందించి తరించుభాగ్యము లేకపోయినను, పురాతనకవివతంసుల యవదానవిశేషంబునం జేసి యుదంచిత మగు వాఙ్మయప్రపంచమున నుసంచితములై తత్తన్మహిమంబులు నేఁటిపాఠకలోకమునకుఁ బ్రత్యక్షములగుచున్నవి. వసంతాగమసమయమున బాలరసాలము నాశ్రయించి మృదుగాన మొనరించు గండుకోయిలచందమున నమ్మహాభాగవతోత్తముల జీవితములఁ బెక్కురు కవిశిఖామణులు ముక్తకంఠములతోఁ బాడి ధన్యతఁ గాంచిరి. నవయుగారంభమునందలి భారతసంతానము తమభావ్యభివృద్ధికై పురాణయుగమును సందర్శించి యమ్మహనీయుల మహత్తరజీవితపరమావధుల గుర్తించి వర్తించుటయే శ్రేయోదాయకము. అజన్మప్రరూఢమై వాసికెక్కిన భక్తిప్రభావమును విషమస్థితులయందు విస్పష్టముగఁ బ్రదర్శించి శుభ్రకీర్తి నందిన ప్రహ్లాదుని, నిఱుపేద యయ్యు నిశ్చలభక్తిపరాయణుఁడై భుక్తిముక్తుల నందినకుచేలుని, తన కపకారము సేయఁ బూనిన మునికుంజరుని దెస ద్వేషము వహింపక నంతో

మముతో భక్తి యొనర్చి వాసి గాంచి మించినయంబరీషుని, క్రీడాసక్త మగు శిశుప్రాయమున నాత్మగౌరవమును వీడక భయంకారరాణ్యప్రదేశములయందుఁ గ్రుమ్మరి నెమ్మనమ్మున నుమ్మలికమ్ము వీడి హరిచరణమ్ము లాశ్రయించి యనన్య సాధ్యంబు లగువరంబులం బడసి నేఁటికిని గగనతలంబున న్నిలిచి భూతలమందలి లేఁత ప్రాయంపుగుఱ్ఱలనీతి ప్రవర్తనము నకు మార్గదర్శకుఁ డైన ధ్రువక్షితీంద్రుని దత్తద్యశోగానమున బహూకరించిన పాఠకులు వేఱొక పవిత్ర భాగవతాగ్రేసరుని విడువక కీర్తింపవలసి యున్నారు.

ఇమ్మహాభాగవతవతంసుని స్మరియింపనిపురాణములు లేవు. పేర్కొననిగాథలు లేవు. తలంపనివాఙ్మయము లేదు. ఆతని పావనపాదపద్మములు మెట్టని ప్రదేశంబులు లేవు. ఆతఁడు ముల్లోకములను సూర్యదేవునిచాడ్పున సంచరించు. వాయు దేవుని క్రియ వర్తించు. ఛాయయై పురాణపూరుషుల వెన్నంటి నడచుచుండు. మఱియుఁ జిత్రవిచిత్రసంఘటనము లకుఁ గారణభూతుఁడై చూపట్టుచుండు. ఒకకృత్యటిలోఁ బర్వతాగ్రమున నిలిచి యక్షీణదీక్షతో నీశ్వరతత్త్వమును మననము సేయుచుండు. వేఱొక్కనిముసమున నవరత్న మయాంగద బాహువల్లరులతో మ్రొక్కులిడుభూపాలమౌళి మ్రోల వింతహాయిలు దీపించుచుండు. మఱొక్కతఱి నాలు మగలయింటికయ్యములనడుమ నిలిచి యారాటములఁ బావు క్రియఁ బోరాటములకు నూతనపరిస్థితులు గల్పించుచుండు.

భూలోక భువర్లోక తపోలోకములు మున్నగు నూర్ధ్వలోకములును, అతల వితల రసాతలాద్యధోలోకములును నమ్మహాభాగునకుఁ గ్రీడారంగములు. ముప్పదిమూఁడుకోట్ల వేల్పులును వానియడుగుఁదమ్ములకు దాసోహ మ్మని మ్రొక్కుచు వాని నృత్తగీతములకుఁ జిత్తములు వికసింప సంతసించుచుందురు. అతఁడు జితేంద్రియుఁడు. నిత్యబ్రహ్మచారి.

విశాలఫాలభాగముతోఁ బ్రఫుల్లనయనకల్హారములతో రుద్రాక్షమాలికావిరాజితం బగు కంబుకంధరముతో మేదురం బగు వీణానాదమున మేళనీతంబమునఁ గ్రుమ్మరు నాభక్తివిశారదుఁడే నారదుఁడు. బ్రహ్మమానసపుత్త్రుఁడై కలియుగమును గూర్చిన యిఱువదిరెండువేలగ్రంథ మగు నారదీయపురాణమునకుఁ గర్తయై పదునెనిమిదిపురాణములు నైకకంఠ్యమున ఘోషించి స్తుతియింప మించినఋషీంద్రునిభక్తిశీలము భారతవిద్యార్థుల పఠనీయగ్రంథములయందు మృగ్య మగుట కాలవైపరీత్యమే యన నగు. అమ్మహోదారచారిత్రుని 'జగడపుఁ గూటిసత్తరు' వనియుఁ 'గలకొట్లమారి' యనియు మాత్రమే గ్రహించిన బాలకమండలికి జాతీయతా ప్రభాతశుభోదయ దీప్తు లెక్కడనిఁ బొడసూప నేర్చు? నిర్జీవము లగు వ్యర్థగాథలతో నమూల్య మగు కాలధర్మమును వమ్ముసేయు విద్యార్థిపౌరుల హృదయవీథుల నున్నతాశయములకై వెదకులాడుట మరుమరీచికాసముదయమ్మున శుభ్రజలంబులకై యూటలూతెడు బాటసారులపరిపాటి కాక మానదు. అట్లగుటఁ

బాలకకిశోరముల భావియశస్సునకై యాశీస్సుల నిడు నీమాని చారిత్రమును శ్రద్ధాళువు లయి పఠియింపఁ గోరుచుఁ గథారంభమును జేయుచున్నారము.

తొల్లింటి మహాకల్పమున సౌందర్యమాధుర్యగాంభీర్యాదిగుణములచే సుందరనారీజనబృందమునకు నయనాభిరాముండై ఉపబర్హణుం డను పేరం బరగు గంధర్వశ్రేష్ఠుం డొక్కరుండు గలఁడు. అతఁ డొక్కనాఁడు లోకనిర్మాత లగు ధాతలచేఁ దా మందఱును గూడి యొనరించు దేవసత్ర మను యాగమున దివ్యమంగళగానముం బొనరుచుటకై యామంత్రితుం డయ్యె. గానవినోదములకై గంధర్వగణమును నప్సరోజనమును గడువడిం జనుచుండె. నిరంతరము స్త్రీజనసేవితుం డయి వినోదించు నుపబర్హణుఁడు గూడ వారిం గూడి యచ్చటికిం బోయె. విశ్వస్రష్టలచేఁ గావింపఁబడుచున్న జన్నము కన్నులపండువు సేయుచుండె. అచ్చరలేమలు విచ్చలవిడిం జేయు నృత్యగీతములతోడను, గాంధర్వకళావిశేషప్రదర్శనములతోడను నిబిడీకృతమై యాగవాటిక యాజ్యాదిహవిర్వినిర్గతసౌరభబహుళధూమపరీతవాతపోతముల సర్వజనహృదయానందసంధాయకమై తనరారుచుండె. అత్తఱి శ్రీహరికల్యాణగాథలను గీర్తించు నప్సరోగణనృత్యగీతంబుల పాల్గొనియు నొకించుక విముఖుఁడై వేఱొక్కచక్కిం జేరి యచ్చరమచ్చెకంటులతోఁ బచ్చవిల్తుని హెచ్చుపోడుముల నిచ్చమెచ్చు నుపబర్హణుఁడు విధాతలచూడ్కులం బడియె.

చేయునదియా దేవసత్రయాగము; యజమానులా బ్రహ్మలు; పాడఁబడునవియా దేవదేవుని యనంతలీలావిలాసములు. అట్టిపుణ్యావసరమున నీతిదూరులచేఁత లేరికి రోఁత పుట్టింపవు? తోడనే వారిజభవులనేత్రములు ప్రళయాగ్ని కీలలవలెఁ జేవురించె. చిటచిటార్భటులతో విస్ఫులింగములు నయనగోళములనుండి రాలఁ దొడంగె. మనోహర ప్రదర్శనము ముహూర్తమాత్రమున భీభత్సరంగముగ మాఱిపోయె. తోడ్తోన కటంబు లదరఁ బటపటం బండ్లు గీటుచు వారు గంధర్వవీరునిం గాంచి "ఓయీ! గంధర్వకుమారా! నీ విటఁ బంకజాతాయతాక్షుని గూడి పాడ నేరక కామినీవారము తోడ విహరించుచుండినకల్మషమున నష్టతేజుండ వగుచు ధారుణీతలమున శూద్రజాతిం జనియింపు" మని శపియించిరి. ఔరా! ఎంతమతిమంతునేని కాంతావలోలత బలువంతల పాలు చేసి యధఃపతితునిఁ జేయక మానదు గదా!

అట్లు శాపవశమున నుపబర్హణుఁడు వేదవాదు లయిన యోగిజనులయింట నూడిగము నేయుదాసికడుపునఁ బసిపాపఁడై జననంబు నొందె. అక్కాంత బాలకుని బ్రేమభరమున నుచితరీతిని బోషించుచు లేఁబ్రాయముననే మునిజన సేవను నియోగించె. అయ్యది వానకాల మగుటఁ జాతుర్మాస్యంబున నేకస్థలనివాసము సేయ సంకల్పించుకొనినజడదారులనడుమ నీబుడుతఁడు మెలఁగఁ దొడంగె. వారలసపర్యలయం దీబాలకుఁ డించుకయేని యేమరక యాటపాటలచేఁ

వీటిబుచ్చక భక్తిపాటవమున నమ్మహనీయుల సేవించుచు వార లొనరించు బ్రహ్మవాదముల వీనులవిందుగా వినుచుండె. మంగళప్రద మని భావించి వారియెంగిళులు ప్రీతిమెయి నారగించుచుండె. ఎండవానల సరకుగొనక వారిదండ నిలిచి భక్తిమై కనుసన్నల మెలంగుచుండె. వర్షకాలశరత్కాలము లతిక్రమించుదనుక నీబాలుఁడు వారల నియతితో సేవించు టంజేసి యత్తపసివేల్పు లీయర్భకునియెడ నిర్భరకృపాంత రంగు లయిరి. అనంతరము వారు శ్రీకృష్ణభగవానుని దివ్య చారిత్రములఁ జదువుచు, వర్ణించుచు, గానము సేయుచు బ్రహ్మానందరసాబ్ధి నోలలాడుచుండిరి. మునీశ్వరులపాదచ్ఛాయల ననుసరించి వర్తించునబ్బాలుఁడును శ్రీకృష్ణచరితామృతమును వీనుఁజేరల జుర్రుచుఁ దన్మహిమాతిశయము గుర్తెఱింగి యన్యమును వీడి విష్ణుసేవనమే యిహపరసాధనం బని కృతనిశ్చయుఁ డయ్యె. దానంజేసి యప్పాపఁడు యోగిజనంబుల యనుగ్రహంబునకుఁ బాత్రుండయ్యె. అక్కతమున నిజ్జగమంతయు మాయాపరికల్పిత మ్మనుజ్ఞానమును ప్రకృతిగుణపరిహారిణి యగు హరిభక్తియుఁ బ్రభవించె. అంత నయ్యోగిజనములకు దీక్షావసానసమయము సమీపించుడు యాత్రావసరము నన్వేషించుచు సేయుపచారముల నెఱుంగక నిరంతర భక్తిపరీతచేతస్కుఁడై శ్రీహరిచరణసరోరుహమ్ముల సేవించు నాకుఱ్ఱనియెడ వారు సంప్రీతచిత్తులై యవ్యాజానురాగమున నీశ్వరతత్త్వమును సంపూర్ణంబుగ నుపదేశించి దేశాంతరంబు చనిరి.

అనంతర మబ్బాలకుండు వారియుపదేశము ననుసరించి వాసుదేవునిమాయానుభావమును దెలిసికొని ప్రణవపూర్వకముగా మూర్తిశూన్యం బగునమ్మంత్రమూర్తిని భక్తి మీఱఁ గీర్తించుచుండ నాపోఁటిగానియుదారవృత్తి కిచ్చ మెచ్చి భక్తవత్సలుఁడు వానికి ధైర్యసాహసముల ననుగ్రహించె. భిక్షులసమక్షమునఁ బరిచర్య సేయుకాలమున వానిమాత యూడిగపుసేఁతలయందు దా ననుభవించుకష్టనిష్ఠురముల నెన్నడును వానికిఁ జెప్పి యెఱుంగదు. తనపరాధీనవృత్తిం గూర్చి వానిచెంగటఁ దలపోయదు. ఆఁకలిదప్పుల బాధలఁ జెప్పి వాపోవదు. తన్నేలినవారిమందిరమునఁ గల పనుల నన్నిటిని గ్రమంబునఁ దీర్చి యిలు సేరి పొంగారు ప్రేమభరంబునఁ గుమారుని జేరఁ జీరి యూరుభాగమునఁ జేర్చి చుంచు దువ్వి చుబుకంబు పుణికి శిరము మూర్కొని పుత్త్రగాత్రపరిష్వంగమున నంగ ముప్పొంగఁ బెక్కువిధముల లాలించి పాలించుచుండు.

ఇవ్విధమున మాతృప్రేమకుఁ బాత్రుఁ డయిన యబ్బానినపుత్త్రుఁడు తల్లిని విడనాడ నోడక నింటనుండియు మోహిగాక యెఱుక విడనాడక మాఱుచింత లేక మౌనిమై కాల మేగించుచుండె. ఇట్లుండ నొకనాఁటివిభావరి నాతనిమాత సదనమును వీడి పాలు పిదుకుటకై వెడలుచుండునవసరమున

నాపెపాద కుళపాఁపతనిపై మోపంబడియె. తోడ్తోన నామె భీకరవ్యాళవిషానలమహోగ్రజ్వాలాతతి కాహుతియై యిలాతలమునఁ గూలె. ప్రేమమూర్తి యైన మాతృదేవత తల్లడపాటుతోఁ బల్లటిల్లుచు నస్తంగత యగుట చూచి మాతృవియోగానల దందహ్యమానహృదయుఁ డయ్యుఁ గొండొకవడికిఁ దేఱుకొని, తత్త్వజిజ్ఞాసు వగుటంజేసి మోహ వశుఁడు గాక మేలు సంధిల్లె నని యుల్లమునఁ దలపోసి యబ్బాలుఁడు · వైష్ణవార్చనల కడ్డంకులు తీఱెఁ గా యని మోదమున మిన్నుముట్టె. భక్తాగ్రగణ్యులచరిత్రములు వింతలు గదా!

అనంతర మ బ్బాలుం డచ్చోటు వాసి యుత్త రాభిముఖుఁడై చనిచని జనపదంబులు, నదీనదంబులు, పురం బులు, పట్టణంబులు, కిరాతపుళిందనికేతనంబులు, మృదుల నిస్వనవిహంగవిహారమందిరము లైన సుందరసరోవరములు నతిక్రమించి యొక్కనదీహ్రదంబునఁ గ్రుంకులిడి శుచియై వార్చి భయంకరసత్త్వసముదయాక్రాంతకాంతారమధ్యమున, నవవేణుకీచకగుల్మలతాగహ్వరములపొంత, రావిమ్రానినీడ విశ్రమించి గురుముఖమునఁ దా విన్నచందమున డెందమునఁ బొందికతోఁ బరమాత్మస్వరూపమును ధ్యానింప దొర కొనియె. ఆనందాశ్రులు వెల్లివిరియ శ్రీపతిధ్యాననిమగ్నుఁడై

యున్న వానితలఁపునకు దేవదేవుఁడు ప్రత్యక్షమైనయట్లు దోఁచె. ఆయుత్తరక్షణముననే యబ్బాలకుఁ డానందాబ్ధి నిమగ్నుండై క్రమ్మఱ నద్దివ్యమంగళాకారమును గన్నులఁ జూడ వేఁడె. కాని కృతార్థుఁడు కాఁజాలఁ డయ్యె. అంతటఁ జేయునది లేక పులకితగాత్రుఁడై యాత్ర మందుచు నిర్మానుష్యం బయినకాననవీథులఁ బరిభ్రమించుచుండె.

అక్కరణి వనాంతరములఁ దిరుగాడువాని నుద్దేశించి వాఙ్మానసాతీతుం డగుశ్రీహరి గంభీరమధురభాషణముల "కుమారా! బేలవై యీలీల నేల శోకిల్లెదవు? ఎట్టులయిన నీ వీపుట్టువున నన్నుఁ జూడఁ జాలవు. కామాదిరిపుషడ్వర్గముల జయించి నిర్మూలితకర్ముఁడైన మునిముఖ్యుఁడే గాని కుయోగి నను గాంచఁ జాలఁడు. నీయార్తి హరించుటకై నా నిజమూర్తిని జూపితి. దీక్షమై నన్ను భజియించువాని దోషపుంజము లంటనేరవు. మత్సేవకతంబున నకుంఠితభక్తి యుదయించు. భయం బుడుగును. జన్మాంతరమునఁ గూడ మాయెడ వీడని గాఢతరభక్తి కుదిరి తిరుగాడుదువు. మా యనుమతినిం జేసి భక్తజనశేఖరుఁడవై యుదయింతువు. బాలకా! యీసృష్టియనంతరమున రాత్రి పోయినవెనుక నిర్దోషుఁడవై నిరూఢస్మృతితోడ జనియించి శుద్ధసాత్వికాగ్రగణ్యుండవై గనుతి గాంచెదవు" అని వచియించి మిన్న

కుండె. ఇట్లమ్మహావాక్యము లాలించిన యనంతరమున నబ్బాలకుఁడు శిరము వంచి కరయుగళము మోడ్చి నమస్కరించి శ్రీహరికరుణాంతరంగమున కాత్మ నుప్పొంగుచు మదము దిగనాడి మచ్చరముఁ బో విడిచి కామక్రోధముల వర్జించి పరమేశ్వరు ననంతనామములతోఁ గీర్తించుచుఁ బరమభద్రము లయిన తచ్చరితముల నిరంతరముఁ జింతించుచు నిత్యనిశాంతసంతుష్టస్వాంతుఁడై కాననాంతరముల వర్తించుచుండె.

ఇవ్విధంబున విషయవిరక్తచిత్తమునఁ గాలమునకై యాతఁడు నిరీక్షించుచుండఁ గొంతకాలమునకు మృత్యువు తనంతనె తటిచ్చలధ్వాంతమున వాని సమీపించె. తోడనే యప్పుడు పంచభూతాత్మకమును, కర్మసంభూతమును నైన పూర్వదేహమును వీడి హరికృపావశంబునఁ బరమభాగవతదేహమును ధరియించె. అంతట నాఖిలం బగు ప్రళయకాలము సమీపించె. త్రైలోక్యసంహారసంజనితాయాసవశంబునఁ బద్మగర్భుఁడు ప్రళయకాలపయోరాశిమధ్యమున శయనించి నిదుర వోవుచుండె. అవ్విధంబున నిదురించు బ్రహ్మనిశ్వాసము వెంట లోనఁ బ్రవేశించి సహస్రయుగపరిమితానంతరమున నప్పద్మగర్భుఁడు మగుడ మేల్కాంచి పునఃసృష్టికుద్యోగించునవసరమున నాతని యుచ్ఛ్వాసమువలన వారీచి

మున్ను గాఁ గల మునిముఖ్యులతోఁ బుట్టినయాతఁడే నారదుం డను పేర బ్రహ్మమానసపుత్రుఁడై పరఁగె. ఇత్తెఱంగున జనన మందినయాతఁ డఖండబ్రహ్మచర్యమును బూని, నారాయణ దేవుని యనుగ్రహాతిరేకమున మూఁడులోకముల బహిరంతర ములయం దెందును నడ్డంకి లేక, బ్రహ్మాభివ్యంజకము లైన సప్తస్వరంబులు దమయంతన మ్రోయు మహతి యనువీణియ తోడుగాఁ బద్మనాభుని పవిత్రగాథలఁ బాడికొనుచు నిరతి శయానందకందళితహృదయారవిందుఁడై స్వైరగతిం దిరు గాడుచుండు.

సంసారాంబుధిని మునింగి కర్మవాంఛలచే దురంత వేదనలఁ బొంది కుందెడివారిని విష్ణునామసంకీర్తనము తెప్ప వలె దరిసేర్పక మానదు. పూర్వభవమున గంధర్వశేఖరుఁడై, శాపవశమున శూద్రగర్భసంజాతుఁడై, మునికులసేవనమున విజ్ఞానఖనియై, పరమభాగవతోత్తమరూపము వొంది ముల్లోక ములును సంచార మొనరించు నీపూతచారిత్రుని కల్యాణ గాథను నిరవధికభక్తిశ్రద్ధలతోఁ బఠియించు బాలకానీకము నకుఁ బరమాత్ముఁ డీప్సితార్థముల ననుగ్రహించి యోముఁ గావుత.

వెండియుఁ బ్రజానిర్మాణశక్తి యలవడుటకై తపం బొనరించు దక్షగర్భసంజాతులకు నివృత్తిమార్గమును బోధించి

దక్షుని యాగ్రహమునకుఁ బాత్రుఁడై నారదుఁడు స్థాన భ్రష్టత్వమును బొంది నాఁటినుండియు నిలువ నీడ లేక లోక సంచారము సేయుచుండె. దీని నాధారంబు చేసికొని కొందఱు కవిప్రకాండులు స్వవిరచిత గ్రంథములయందు వలసినవిధమున సాక్షాత్కారము గావించుకొని యీపరమభాగవతాగ్రేసరు నకు నీత్రికాలసంవేదికి నిర్హేతుకముగ నారోపించిన కలహ శీలత్వమును జదువరులు గుర్తించి యీమునిమహాశయుని శుభ్రకీర్తులనే కీర్తించి తరియించెదరు గాక.



# తిన్నఁడు

భరతఖండమునకు మండనాయమానం బగుచు ముముక్షువులకు మోక్షప్రదం బయి దక్షిణకైలాసంబు నాఁ బరఁగు శ్రీకాళహస్తి యను పురవరం బొండు భాసిల్లుచుండు. అందలిసుందరీబృందములే యోగిజనంబులకైవడిఁ దనరారు నన భక్తజనానీకంబు చెయిదములం గూర్చి వేఱుగ వచియింప నేల? భక్తావతంసు లగుసాధుపుంగవులు పెక్కండ్రు తన్నగర మాహాత్మ్యమును వేనోళ్ల నుగ్గడించుచు సందర్శించి తరి యించుచుందురు.

తత్పట్టణము మహోన్నతగిరిశిఖరమున నిర్మితం బగుటఁ జేసి నలుకెలంకుల సుందరలతాతరుబృందములచే నలంకరింపఁబడి, కమ్మతావులు గమ్మున నెగజిమ్ము బహువిధవిచిత్రకుసుమస్తబకంబు లొలయ, మోక్షలక్ష్మిసామ్రాజ్యమున కర్తిసదీపిక లనం జెల్లు నికేతనముల నింపు సొంపార, చూపఱకు నేత్రపర్వం బొనరించుచుండు.

తొల్లి యొకప్పుడు వసిష్ఠభగవానుఁ డరుంధతిం గూడి దక్షిణామూర్తిని సేవింప నచ్చటి కేతెంచి తత్పరిసరంబుల నెందును మజ్జనపానాదులకు నిర్మలాంబువులు గానరామిఁ గరంబు వెఱఁగంది పరమేశ్వరునిం గూరిచి తపం బొనర్చి యవనీతలంబున కవతరింపఁ జేసిన దివ్యాపగ సువర్ణముఖి యవ్వీటికుఢంగటఁ జిఱుతరంగములఁ దురంగళించుచుండు.

అందు ముంగాళ్లు వంచి మోరలు సారించి శిరంబుల గుంచి తనివార నీ రానుచుఁ, బచ్చనిపచ్చికబయళ్లఁ దుళ్లిం లిడు దుప్పికూనలు విశ్వరంగమునఁ బరంధామునిసృష్టివిలా ప్రదర్శనమునకు నాందీప్రస్తావనలు నడపువిధంబునఁ జూపట్టు చుండు. హరుండు నిజావాసం బగు రజతగిరీంద్రమును వీ యువ్వేడుకలకుఁ బుయిలోడక గిరిజాద్వితీయుం డయి వివిధ రూపముల నందుఁ జిందులాడుచుండు.

అందలిప్రాణు లగ్గిరీంద్రమహిమాతిశయంబునం జే జటలు ధరింపక, యంగజునిపొం గడంచి కుంగింపక, మే బూదిపూఁతలు పూయక, భిక్షు దేవురింపక, యజినాంబర ములు సింగారింపక, రంగారు పులితోలువడ్డాణంబులు కటి సీమల పొంకయింపక, విచిత్రలీలల శివత్వము నందుచుండు దురు. సకలలోకసన్నుతం బయిన తత్పూరవర ప్రాభవమును తూచా తప్పకుండఁ గొండాడఁ జతురాస్యునకుం జెల్లు దక సితరు లెంతవారు ?

అమ్మహానగంబునఁ గృతయుగంపువేళ మర్కటకకీటకం బొండు డెందమునఁ గరకంఠుని బొందుగ భజియింప సమ కట్టి నాభికాంతర్గతబహుతంతుసంతతులచే నమ్మహాదేవునకుఁ బ్రాకారంబులు, గోపురంబులు, కొలువుకూటములు, నర్తనా గారములు, మఱియు నెన్నేనిసుందరమందిరములు, పందిళులు, కేళీనివాసంబులు, గర్భగృహంబులు నపూర్వశిల్పకల్పనల నంతరించి నిర్భరానందమునఁ డోఁగాడుచుండె. ఉమఃకాల

తుషారశీకరవారి పొత్తుగొని మౌక్తికోపశాగారము లట్లును, వింతమెఱుంగులఁ దురంగలించు రవిరశ్మివిడంబనంబున నవరత్నస్థగితాగారముల లీలను లూతాకల్పితతంతుసంతతులు విరాజిల్లుచుండు.

చెలఁదియుఁ దీరుగ నత్తెఱంగున జతనము గావించిన దేవాగారముల నిరంతరదీక్షమెయి సంరక్షించుచు నెఱి పోఁగులు వాతూలహతిం జెదరినపోఁగుల సవరించుచుఁ దీక్ష మాని త్రిలోచనుని గంటు మిగిలి సేవించుచుండె.

అక్కృతంబున నకుంఠితభక్తిశ్రద్ధలమెయిం గాంబు గడపు చెలంది సేమమును బరీక్షింపఁ గోరి నిటలాక్షుండు నిజాగారంబున నుద్దీపించు దీపశిఖలం బ్రజ్వరిల్లం జేసి యూర్ణాభిసంరంభమున నయ్యాగారంబుల నెల్ల విధ్వంసం బొనరించె.

అవ్విధంబున దేవగేహములు దావపావకకీలికాసముదయంబున కాహుతి యగుటం గాంచి నిరవధిక ప్రయాసంబున శంభునికొఱకుఁ జెక్కెడులు గట్టినసదనంబులు "కుమ్మరి కొక యేఁడును గుది కొక పెట్టు" సన్నసూక్తిని నశించుట కాకీటకమ్ము నెమ్మనమ్మున నమ్మలికమ్ము నొంది జీవనభ్రాంతిఁ దొఱంగ నద్దీపికానలశిఖావిసరంబు ద్రావ నుంకించె.

అత్తఱిఁ దనయుత్తమాంగ మంగళంబున కొసంగ సంసిద్ధం బయిన కీటకరాజంబుం గాంచి గౌరీవామాంగుఁడు తనకెంగేలున దానిం బట్టియెత్తి "నీసద్భక్తికిచ్చ మెచ్చితి; నీయభిమతార్థములు సిద్ధించెడుఁ గావుత" మని కరుణారసంబు

నిగుడఁ బ్రేమపురస్సరముగ నాశీర్వదించి సురమునీశ్వరదానవానీకంబులు సన్నుతింపఁ దనదివ్యతేజమున లూతాధీశ్వరుని విలీనముం గావించె.

తదనంతరంబు త్రేతాంతంబున నొక్కకాలఫణి పాతాళంబుననుండి దివ్యమాణిక్యసంచయంబు గొనితెచ్చి ప్రాతర్వేళల నియతి దప్పకుండ బాలేందుమౌళు నర్చనములు గావించి మగుడఁ జనుచుండె.

ద్వాపరయుగారంభమున హస్తిశ్రేష్ఠం బొకండు వచ్చి యచ్చోటు దిలకించి పులకితగాత్రంబై కేతకస్రవంతిం గ్రుంకులిడి పొఁగము లీడిన తామరలును బింకము వాసిన కుముదసముదయంబులు నిశ్శంకముగఁ గొనివచ్చి ఫణిసమర్పితం బగు మణిగణంబుల నెల్లం జోఁద్రోచి తుండాదండమ్మున సంగ్రహించిన నిర్మలకాండంబులు ఖండపరశునిపయిం గండూషించి మాలూరశాఖలు నాళీకకహ్లారములు సమర్పించి పూజించి తనయిరవునకు మరలుచుండె.

అంత మఱునాఁటివఱువాత నప్పాపఱేఁడు తొంటివలె బిలు వెడలి నిజఫణాగ్రమాణిక్యసమగ్రదీప్తులు తపనకిరణనికరంబునకుఁ దోడుపడి యుషఃకాలసంతమసంబును దవ్వులఁ బాఱఁ జిమ్మ భవుని సమీపించి దర్శించి కటకటంబడి "యకటా! నేఁ డెవ్వండో బాలిశుం డొక్కరుండు శివలింగమునిమీఁది రత్నరాసుల భంగపఱచి ములుకంపలు గప్పి యెగ్గొనరించెం జో" యని యగ్గలం బగు విషాదానలంబున

మ్రగ్గి యగ్గజరాజు పొనరించినపూజాదికముల నెల్లం గ్రమ్మఱ దూరమ్ముగఁ జిమ్మివైచి యుల్లమున ననూయాభక్తులు పెల్లుగ మల్లడిగొన గౌరీవల్లభుని మణిగణంబుల నర్చించి నిజావాసం బునకు నిర్గమించె.

తదనంతరము మఱికొంతకాలమునకుం దంతిఱేఁడు శివునినిలయంబు సమీపించి రత్నసంక్రాంతశరీరుం డగునీశ్వ రుని విలోకించి సంకుచితగాత్రుం డై యాక్రోశించి “నే డెవ్వండో బహుగువెడఁ గజ్ఞానాంధకారమునఁ గన్ను గానక బహువర్ణంబులగు ఱాలఁ గపర్దికిఁ గసక్రుసక్రుపుఁబూజ నొన రించెం బో” యని చింతించి యెప్పటియనువున శివు నర్చించి వనాంతర్గతుం డయ్యె.

వెండియు మఱునాఁటి ప్రభాతంబున నప్పణీశ్వరుండు మచ్చిక మీఱ శివుని బూజింప వచ్చి బిల్వవిటపశ్రేణీ యుతం బగు దవ్వలింగముం గాంచి పట్టరాని బిట్టలుకం గట కటంబడి తనజన్మము నిరర్థకం బని వలవించి “యెల్లి నా వ్రతము కొల్లఁబోయినఁ జూచెదం గాక” యని తల వంకించి “నీ నొనరించిన రత్నపూజలు దిక్కులం బాఱఁజల్లి జంగిలిగుహా శాఖలు తమ్మికాడలుం గొనివచ్చి పయిం బెట్టిన భక్తవశంకరుం డగుశంకరుం డెట్లోరిచెనో! దైవము కూడ వగవారిం గూడె” నని గోడుగుడుచుచు శివలింగము నుద్దేశించి,

గీ. కంటకి పెట్టు నాక మహత్వము నొందితి వట్ట్య పార్వతీ
కంటకితాంగబాహులతికాయుగసంగతిఁ బోలె మత్సుఖ
ప్రాంటిక దివ్యకోకములకొండమ లగ్గిన మోచి మోచి ము
క్కంటి! యొయ్యంగనే నొసలికంటిమహాత్మ్యము నీకుఁ గల్గుటన్!

అని శోకించి యానందశోక మెట్టకేలకు బెదరిన హృదయమును బదిలపఱచుకొని యాత్మేశు నర్చన సేయం దలపోసి దంతికృతపూజలం గొఁద్రావి వయిం గప్పిన పూదమూరమును బుస్సలం జో నూఁద యనర్ఘ్యరత్న నికరంబుల సంపూజించి భోగవతీపురంబు సొచ్చె.

అత్తెఱంగునఁ జెచ్చెర నిజనివాసంబు సొచ్చి యచ్చెలువ తేఁడు మనంబునం గల కలంకమెయిన్ మచ్చెకంటులంగూడి విచ్చలవిడి సంచరింప నిచ్చగింపఁడయ్యె. పువ్వుఁబోణులు నవ్వువెన్నెలలు మీఱ వండి వడ్డింప మధురసుధాహారముల భుజింపఁ దలపెట్టఁడయ్యె. మఱియు బహువిధతానసంపన్న గానాలాపంబులఁ జొక్కుమక్కువల సుక్కఁడు. ప్రాణ వల్లభలతోడఁ గూడి పర్యంకసీమల సంభ్రమములు చవి చూడఁడు. నిద్రాసౌఖ్యసుఖ మెఱుంగఁడు. సమధికభోగ భాగ్యవిలాసములు విస్మరించి మోహవల్లరులం ద్రుంచి దైనం దినరత్నపూజావినాశము మది నెంచి చివికి చివికి నాఁటిరేయి శివరాత్రిగ నప్పావతేఁడు జాగరము సేయఁ దొడంగె.

తొల్లింటిదివసంబునఁ దా నర్పించిన పూజాద్రవ్యం బులు దర్వీకరోత్తముని వేడిబుసలచే వసివాడి వత్తలయిన

వెనుక సదానాసేవ మేగుదెంచి శివునిపయి నానావిధరత్న రాసులు ప్రోగువడియుంట గాంచి విశ్వనాయకునివంక దృష్టి సారించి

ఉ. అచ్చపుటెలవర్ణద్యుతదావళి నల్లనికల్వలో? కడుం
బచ్చనిడాలు బిల్వవనపత్రములో? యరుణాశ్మభంగముల్
విచ్చినయొజ్జతామరలొ? విశ్వపతీ! నిరసోపలంబు లె
ట్లిచ్చిన లయ్యె నెకు? నవి యుండుగ గంధము సౌరభ్యముల్.

చ. తనికి శిలోచ్చయంబు, నిజయోష శిలోచ్చయరాజపుత్రి, ని
ధనువు శిలోచ్చయంబు, పురదాహ! రతీకృతరత్నగర్భ! ని
మనముస కిశిలాశకలమండన మెట్లు ప్రియంబు సేసె? నే
మనఁగలవాఁడ నిన్ను ప్రతిహాని యొనర్చుచురాత్తుఁ డుండఁగన్.

అని వాపోవుచుఁ గొంచెకవడి చింతించి "మైన నేమాయె? నేటికి నాయెంబో, నిత్యంబు నీశ్వరుని సేవించు వేళం గాక రేపాడి వచ్చెదం గాక! నే నొనరించిననముచిత పూజనములు వోయి భర్గునిపయిం బాషాణవ్రాతము లుండి యర్చావ్రతహాంత గన్నులంబడిన నదియు మదీయసుకృతంబు. వాఁడో నేనో యొకజాడం బోయెదము గాక, లేదేని ప్రాణము లర్పించువాఁడ. ప్రాణములవిరాఁదఁ దీపుం గల జీవులకు విరుదువ్రతంబులు కల్యాణకరంబులు గా నోపవు కదా! కానిమ్ము చూచెదం గాక నందియుం జేల!" యని నాఁటికి శివుని నర్చించి మదేభరాజము తననయిచ్చం జనియె.

అట్లు చని చని యగ్గజరాజు పిడియేనుంగులఁ గూడి

వేడుకలాడినం గాని యుడుగని వెడవిల్తువేడిమి మదిం దల పోయఁడు. తుండాగ్రంబునఁ బట్టి గండభాగంబుల కెగఁజిమ్ము కొనినం గాని తెమలని మిహిరదాహంబును సరకు సేయఁడు. పద్మాకరగర్భంబు సొచ్చి నిర్భరానందమునఁ దిరుగాడుచు బిసరుహకాండములం ద్రుంచి మెసవినఁ గాని నమసిపోవని క్షుధార్తి నుపలక్షింపఁడు. సింహపోతముల భీషణగర్జానినాద సంజనితభయాతంకాగ్నిఁ గ్రుంకఁ బాఱఁడు. నిత్యము పంచ బంగాళమై యొప్పారు శివార్చనావిధానముం గూరిచి చింత యనువేఁకి తన్ను బీడించుచుండ నాత్మసీమం జేరి యెవ్వ డంశుమంతుం డస్తాద్రి నలంకరించు, నెవ్వ డుదయం బగు నని తలపోయునవసరంబున,

సీ. ప్రాగ్వధూమణి చిమ్మఁ బశ్చిమదిక్కాంత
        పట్టిన చెంగల్వబంతి యనఁగఁ
    గాలవిష్ణుం డంధకారదైత్యుని వ్రేయఁ
        జరమాద్రిఁ బడిపోవు చక్ర మనఁగ
    దినమహీరుహమునఁ దేజోమయంబుగాఁ
        బండి రాలిన పెద్దపం డనఁగ
    దివినుండి దేవదానవయుద్ధరక్తార్ద్రి
        మై నేలఁ గూలు రథాంగ మనఁగఁ
    బద్మినిసంగమక్రాంతిఁ బరిహరింప
    నపరజలనిధి జలకంబు లాడఁ బోవు
    కరణి, కెంపుసంజ చందురుగావిపచ్చ
    డంబు ధరఁ జెట్టి భానుబింబంబు గ్రుంకె

ఇవ్విధంబునఁ బతంగదేవుం డపరాంబుధిఁ గ్రుంకుటయు సంధ్యారాగరామణీయకంబును గమ్మదెమ్మెరలసంచారసౌకుమార్యంబును నళినీవిహారమధురఝుంకృతంబును లోనుగాఁ గల సృష్టివిలాసంబులు పరమాద్భుతంబుగఁ బ్రదర్శింపఁబడి ప్రకృతిదేవ్యుపాసాపిపాసితు లగు కోవిదులహృదయాంతరంబుల విచిత్రభావముద్రలను జిత్రించి తదనంతరము సకలాపూర్ణుండు నీలవర్ణుం డనుట మిథ్యావచనంబులు కాఁ జాలవని తెలుపుపోలిక, నావింతచీఁకటులు విరియంబాఱె. ఆదివేల్పునకు నిర్జరాధీశ్వరు లర్పించిన దివ్యకుసుమాంజలు లట్లు తారకాగణము మింట దీపించుచుండె. అమ్మహాదేవునకు భేదభావంబు శూన్యం బని తేటంబుగ వెల్లడించుపోలిక నలుపుదెలుపులు తిలతండులన్యాయమున లోకమున నలమికొన సాగె.

అనంతరము కుముదవనాళికి మోదప్రదం బయి, కోకములయాటకు మేటికూటం బయి, దిగ్వధూనమితికి రజతంబు పూఁత యయి, చకోరరాజికి మేఁత యయి, సర్పకశాస్త్రనిరూపితౌషధంబు నాఁ బండువెన్నెల యెల్లరకును పండువై నిండుకొనియె.

అత్తఱి సామజసర్పరాజములు మహావ్రతవిఘ్నవిషాదవేదనలు ముప్పిరిఁగొనఁ గనుమూయ నెఱుంగక యెవ్వారు తెల్లవాఱు, నెప్పుడు సహింపరానిపరాభవాగ్ని చల్లారు నని చిత్తములఁ దత్తరపడుచున్నంతఁ, గాలరసవాది బ్రహ్మాండ

గోళం బంతయు సువర్ణరాసిగఁ జేయ నాసించి ద్యుమణిశిఖ మీఁదఁ బఱపు సిందూరరాజి యనఁగ నరుణశోణాంశురాజి విరాజిల సాగె.

అంత గజపన్నగంబులు పరస్పరవైరములు సాధించి శివసాన్నిధ్యంబు నొందు టెట్లో వీక్షించువేడుక నుదయించె నాఁగ గర్మసాక్షి ప్రత్యక్షంబగుసూచనలు గోచరింపఁదొడంగె. రవిబింబ ముదయాద్రి నలంకరింపకమున్నె కుంభీనసవల్లభుండు మఱిఁ జేర్చినరోషభరంబున నిజస్థానమునుండి నిర్గమించి యుచితగమనవేగంబున భర్గుని సమీపించి తా నొనరించినపూజ లేమి కుల్లమునం బెల్లుగఁ జింతిల్లి చిరవైరంబు నాఁటితో సాధింప సమకట్టి పిన్నరూపంబున బిల్వశాఖాంబుజనాళమధ్యసీమ నడఁగిమడఁగి యుండె.

కొండొకవడికి దీక్షాయత్తంబున నుత్తలమందుచు మత్తగజేంద్రము సమీపించి చిత్తజారిపయిం దా నొనరించినపూజలు నిలిచియుండుటం గాంచి పూర్వజన్మవేళాసుకృతంబు ఫలియించెనో, విఘ్నకర్త సంత్రాసము నొందెనో, వ్రతము ధన్యతం బొందెనో, యని చిత్తమునఁ బొంగి పొరలి నింగి ముట్టి క్రమ్మర వెనుదిరిగి పద్మాకరము చేరంబోయి బిసరుహకాండమ్ములుం గాండంబులు వీపునం దొండంబున న్నిండించుకొని బిరాన శివలింగమును జేరం జనుదెంచి పాపహృదయశల్యం బగునిర్మాల్యంబు దుడుపం దలంచి తుండాదండంబు వైశంబ సారించె.

అత్తఱిఁ జిన్నరూపమున రోషదవానశిఖలు కన్నుంగొనలఁ జెన్ను వహింప డాగియున్న పన్నగంబు దంతిముఖాంతరంబు ప్రవేశించి కుంభకుహరస్థానంబు చేరి కుమ్మరిసారె విధంబున ముమ్మరముగఁ ద్రిమ్మరుచుండె.

అనంతర మాసామజేంద్రం బంతింతనరాని వేదనం బడి నెవ్వగలం బొగులుచుఁ గొండ ల్గూలఁగ నెత్తి మొత్తుకొనసాగె. మొగిలేటిమడుంగునఁ గ్రుంకులిడి తుండమ్మున మొంటుగఁ దోయకణమ్ము లాకర్షించి జల్లునఁ జిందఁ దొడంగె. ఉడివోని వేదనాభరంబునఁ బెగ్గులు వాటివాటి పొదలపయిం బడి పెడమర్లుగాఁ బొర్లి పొర్లి శాఖాస్కంధములతోఁ గుంభపీఠయుగము ఢీకొలుపుచుండె.

ఇట్లు పెద్దయుం బ్రొద్దగ్గజరాజము పీడావిముక్తి కయి శక్తికొలందిఁ బ్రయత్నించి మరణాసన్నమైన దని గ్రహియించి వైరి నిగ్రహింపక సమసిపోవుట ధీరపద్ధతి కాదని నిశ్చయించి చిత్తజాహితుని దిక్కు మొగంబయి నిలిచి మ్రొక్కులిడి యరాతి యే కనుమం బోవునో యని తుండ మెత్తియం జుట్టి హస్తస్థలంబునఁ గీలించి పిడికిం జని మేను గుంచి శిరంబు వంచి కుంభపీఠము బీటలువాఱునట్లు తత్కూటపాటము లూటాడునట్లు గుభిల్లున నక్కొండం దాఁకె.

అగ్గిరీంద్రతాడనంబున హస్తిమస్తకము తుత్తునియలగుటయు నెత్తురు పడియుగట్టె. మదవారణకుంభకుహర

ఘనం దిరుగాడుపాము చిదసె. మరణస్థానం బపరకైలాస మగుటను సువర్ణముఖీతటం బగుటను గాద్రవేయభద్రగజం బులు రుద్రగణాకారంబులం దాల్చి తరించిరి.

అంత నమ్మహాలింగమధ్యంబునందుండి కొండలరేని కూరిమికూఁతుతోడఁ గూడి చంద్రచూడామణి వృషభ వాహనారూఢుం డయి యవతరించి కాళనాగ నాగేంద్రంబు లకు సాయుజ్యం బొసఁగూరిచి యంతర్హితుం డయ్యె.

తొల్లి మదోద్రేకంబునఁ బద్మసూతి యొనర్చినసృష్టికిం బ్రతిసృష్టిఁ గావించి నేర్పు జూపిననేరంబునకయి శపియింపం బడి గజకాననమధ్యంబున లూతాకీటకరూపంబున శంకరుని సేవించుచుండిన విశ్వకర్మపుత్రకుం డగు ఊర్ణనాభుండును, మునిజనసిద్ధసంసేవ్యమానం బయి ముక్తిలలనామణీకేళి కావాసమై చెలువారు రజతాద్రియందు శంభుం డొకనాఁడు సం[illegible]కొలువుండ నంగనాకేళీప్రసంగసుఖభంగమున కోడి సేవకు రాకుండినదోసంబునకయి శపియింపం బడి కాళనాగ రూపంబున నక్కాననంబునఁ జరించుచు హరుని పూజించు చుండిన కాళనామభుజంగుండును, కొండొకనాఁడు గౌరీ మహేశు లేకాంతంబుగ శుద్ధాంతసీమ మంతనక్రియలు సాగించుచుండ మదాంధుండై నగరికావలివాఁడ్రం ద్రోసి పుష్ప తనయిచ్చం జనుదెంచిన యపరాధంబునకయి భవానీ దేవిచే శపియింపంబడి మదహస్తియై కాననాంతరమున సుమావళిని భజియించుచుండిన హస్తిప్రమథాగ్రణియుఁ

గమంబునఁ గృత త్రేతా ద్వాపరయుగంబుల నిస్తులభక్తి ప్రపత్తులు నెఱపి యమ్మహాదేవునను గ్రహంబున శాపవిముక్తిం గాంచి శివసాయుజ్యము బొందుటంజేసి, నాటంగోలెఁ దన్నా గంబు 'శ్రీ, కాళ, హస్తి' ముక్తిసూచకంబుగా, 'శ్రీకాళహస్తి' నామంబు వహించి దివ్యక్షేత్రం బయి విలసిల్లుచుండు.

అమ్మహీధరప్రాంతకాంతారంబుపొంత 'నుడుమూ'రను పుళిందావాసం బొండు గండు మిగిలి కనుపండు వొనరించుచుండు. కిరాతవ్రాతంబునకాగ నయ్యు నిస్తులవైభవోపేతమై యాపురవరంబు గడుంగడు రమణీయం బయి తనరారు చుండు.

అందుఁ బొందలరారు గోపురంబులు బోయ చెంచులే జవరాండ్రు వరాహదంష్ట్రలనుండి, కుంభసములు వీడిన కోడె త్రాచులనుండి, మదసామజమస్తకంబులనుండి, వేణుగణంబుల నుండియు లభియించిన ముక్తాఫలంబులను రేఁగుపండ్లకరణి, కురువిందములచందమున, నుసిరికాయలభంగి, యాడుగ పండ్లవడువునం బరామర్శించుచుందురు. గంధసారాగురు ద్రుమకాష్ఠఖండములం దమయింటివంటకట్టియలట్లు గుర్తించి చెంచుముంచుఁబోండ్లు వర్తించుచుందురు. మఱియు కస్తూరి పునుఁగు జవ్వాదులు భాండంబులఁ గుస్తరించి, పంకముం జేసి గృహసీమల కలయంపి సొంపులు నింపుదురు. శిష్టరాసులు గృహావరణంబుల నెల్లం గుప్పతిప్ప లగుచు నిండి గోమయ ప్రతతులట్లు చూపట్టుచుండు. భిల్లకర్షకులు తమరాగిచేలను

బిలబిలాక్షులకుక్షులనుండి సంరక్షించుటకయి నిర్మించిన వెఱబొమ్మలకుత్తమ్ము లగురుత్మాదమహాగాఢసౌరభమునం గుబాళించుచుండు. మేనఁ బూసిన మసిపూఁతలు మృగనాభి వాసనలచే సువాసించుచుండు. చమరీమృగవాలజాలములు ధమ్మిల్లములసొంపు నింపి యింపెసలాఁగుచుండు. మదసామజకుంభగళితముక్తాఫలంబులు నేత్రంబులై చిత్రము గొలుపుచుండు.

అప్పీటిబోటులు పట్టుపుట్టంబులం గట్టుభాగ్యంబు గలిగియుఁ జాలుటాకులు గట్ట భారి మసరు. రుచిరరాజాన్న భోజనవైభవశ్రీ గలిగియు వన్యధాన్యముల నీసడింపరు. మాణిక్యమణిమయభూషణశ్రేణులచే విరాజిల్లుచుండియు నెఱ్ఱనికురువింద లేటికని నింద సేయరు. భర్తృజోపికల నూఁగులాడు వేడుకలం గూడియుఁ బూఁదీఁగటుయ్యాలలవియ్యము సేయరు. పెంపెసలారు సంపదాళులచే నుద్దీపించియుఁ గులాగతధర్మకర్మముల విస్మరింపక, మహిమాతిరేకములచే రేకత్తియు సహజవృత్తిని మానక, పరధర్మము భయావహ మ్మని నెమ్మదిని నమ్మి సంచరించు చెంచుమించుఁబోఁడులతో నొప్పి యప్పురి కప్పురపుఁగుళిక వోలె, పరిఫుల్లకహ్లారపద్మాకరంబు భాతి, పరిపూర్ణసుధాకరం బగునిశీథంబుడంబున, పుత్రగాత్ర పరిష్వంగమట్లు, విశుద్ధనిర్మలమహాకావ్యంబుభాతి నింపు నింపి పెంపెసలారుచుండు.

జంజారువెండ్రుకలు మోముపయిం గునిసియాడ, కటిసీమల నలంకరించిన పాలుటాకులు వాతూలహతిం జెదరి

త్రుళ్లింతలిడుచుండ, మంచెలమీఁద నిలిచి మృగాళనము బాహాలతికలం జాచి యొడిసెలలు గిఱ్ఱునం ద్రిప్పుచుఁ బిట్టలం గొట్టి చెంచులేఁబ్రాయంపుటంగనలు చూడ వేడుకలు గొలుపుచుందురు. కలికుంగులుచ నెఱికురులకు బర్హి పింఛములు చుట్టి, పాలుటాకులపయఁటలు వాటముగ దీటుకొలిపి, కేగురుబొట్టులు లలాటఫలకంబుల రాణింపుచుండ, నడలయొయ్యారంబున గురువింద పేరులు దాఁగుడుమూఁతలాడుచుండఁ గటిభాగంబు నంటి జిలుజిలియొడ్డాణంబునఁదున. బర్హాంబరము వసందు గొలుపఁ, గొలుచగనుపుఁ వెదురువిల్లులం గనికకోలలం జేఁబూని భిల్లబిసరుహాక్షులు ఁగాత్మనాయకులఁ గూడి యడవిం దిరుగాడు వేడుకలు వర్ణనాతీతములు. సింహకిశోరముల తోడను హరిణకుణకములతోడను మయూరశాబకంబుల తోడను నొప్పి యొప్పు కిరాతులనిజాగారంబులు కరంబు డంబు మీఱుచుండు.

ఇట్లు సకలవిభవాభిరామంబున శోభాయమానంబగు సప్తకర్ణంబు నాథనాథునిచే విక్రమక్రమదర్పంబులు పెంపెసలారఁ బాలింపఁబడుచుండు. తండె యను మంగాలుని వానియర్ధాంగిలక్ష్మి యయి సర్వలోకేశునకు గౌరిచందమునఁ బొం దొనరించుచుండు.

ఇట్లాపులిందదంపతులు వివిధగతులఁ గాననసామ్రాజ్య సుఖంబుల ననుభవించుచు గిరికందరములపొంత, నిర్ఝరాళి నడుమ, సానువులనీడ, మల్లెపొల్లవిరజాజిపూఁబొదరిండ్లక్రేవ,

విచిత్రగతుల నలంకరింపఁబడిన పుష్పాదిదుప్పటులపై విహా
రంబు సలుపుచుఁ బెద్దకాలంబు రాజ్యంబు చేసి సుఖయించు
చుండ, శైలజాధిపునియనుగ్రహంబున మందస్మితజితకుంద
యగు తండెరకు నెలమసలుట సంభవించె.

అక్కాలంబున గర్భవతి యగు నక్కిరాతరాజపత్ని
యుద్భవింపనున్నయర్భకుం డీశ్వరుండై ప్రకాశింపఁ గలం
డని మేనిచిహ్నములఁ బ్రకటించుచు దినదినాభివృద్ధిం గాంచు
చుండె. వెండియు నాశబరకాంత తనడెందమునం గొండొక
తఱి సింహ శరభ వ్యాఘ్ర మదేభయూథములం బట్టి చించి
చెండాడ నుంకించుచుండు. ఒక్కొకవేళ శైలోపకంఠనిర్ఝర
సైకతస్థలములపొంత మక్కువ మీఱ శివుని దర్శింపఁ గాంక్షించు
చుండు. మఱొక్కతఱి ఖండేందుశేఖరునకు గండూషితాంబు
ధారల మజ్జనమ్ము గావించి రుచికరంబు లగు సూకరపలలం
బులు నివేదించి నేత్రనీలోత్పలంబుల నర్చింపఁ గోరుచుండు.

ఇవ్విధంబు లగు నీప్సితంబులఁ బ్రొద్దులుపుచ్చుచు
నిత్యము గావించు గృహోచితకృత్యంబుల నాచరింప మన
సొప్పక, పెంపుడురాచిలుకపిల్ల కొద్దిక మీఱ సుద్దుల నేని
చెప్ప నేరక, చిత్రవిచిత్రంబు లగు వస్త్రవిభూషలం దాలువ
నిచ్చగింపక, నప్పులిందబృందారకునియిల్లాలు కాల మేగించు
చున్నంత, నొక్క శుభముహూర్తంబున సర్వలక్షణలక్షితుం
డగు శుభనందనుం డుదయించె.

అట్టిమహోత్తమం బగు కళ్యాణకాలంబున భిల్ల

పురంధ్రు లందఱు గుమి గూడి కాలోచితంబుల నెఱి సంసారమోహపాశములం దెగటార్చునట్లు పసినిమఁగునకు బొడ్డు గోసి, యీశ్వరభక్తిలక్షణములం దెలిపెడురీతి విభూతి పట్టె తీఱిచి, పావకదంబజంబాలంబు మాన్పుక్రియ నీళ్లారిచి, చిత్సుధారసము వోని చిట్టాముదంబు పెట్టి యప్పట్టిని పానువు పయిఁ బవ్వళింపఁ బెట్టిరి.

అత్తెఱంగున మెత్తనిపొత్తిళ్ల నడుమం బొరలాడు నబ్బాలకుండు కొండొకవడికి లోకవ్యాపారపరిణామం బెట్టిదో తిలకింప వాంఛించె నాఁ గన్ను దెఱచె; శివభక్తిశూన్యం బయి జగంబు నశియించుచుండుటం గాంచి పరిహసించు చుండె నన మొలకనవ్వులు చిఱుపెదవులపయిం జిందులాడఁ దొడంగె. లోకంబున ముమ్మరమ్ముగఁ గ్రమ్ముకొనిన మోహ బంధములఁ దెగఁదన్నుగతి ముద్దుపదమ్ము లెత్తి నిట్టఁటు విదల్చుచు నాడుకొనుచుండి, కొంతకాలంబునకు శ్రేయో మహోరాజ్యసింహాసనమున నిండుకొలువుండుచందమున లేచి కూర్చుండి, వసుంధరాతలమున పశుపతిభక్తి యను మణికయి వెదకులాడువడువునఁ దడవియాడుచు, జగత్పరిపూర్ణుం డగు పరంధాముని డాయ భీతిల్లఁ బదంబులు తొట్రిలుచుండె నాఁ దప్పటడుగులు వెట్టుచుఁ, దల్లిదండ్రులకు ముదంబు సేయు చుండె.

ఇట్లు దినదినప్రవర్ధమానంబులును లోకసమ్మాననీయం బులును, శివభక్తిలక్షణోపేతంబులును నయి పొలుపారు

నాచియుతని చక్కఁదనమునకుఁ బుళిందభూనాథుండును, తండె యు డెంకముల నలరుచుఁ బన్నగశయనునివయి చిన్నికుమారునకుఁ గల భక్తిశ్రద్ధల తిన్నఁదనమునకు మఱిమఱి మురియుచుఁ గ్రన్నన నబ్బాలకునకుఁ దిన్నం డని నామకరణంబు గావించిరి.

అవ్యక్తమధురసుధారసప్రపూర్ణం బగు తిన్ననిలేఁబ్రాయంబు మనోహరం బయి శబరదంపతులకే కాక వాడ వాడలం దిరుగాడెడి యీనుఁగోడెగాండ్రెల్లరకు నుల్లములు పల్లవింపంజేయఁ దొడంగె. విని ర్మలవారిపూరముల జలకమార్చి, నెన్నుదుటిపయి విభూతిరేఖలం దీర్చి, గుంజాబీజసంకీర్ణం బగు మేఖలం గటిసీమ నలంకరించి, మయూరపత తూలికాజాలముల నమరించినకడియములు దండలకు సవరించి, వెడఁద లగు వాలుంగన్నులకుఁ గాటుకరేకలు దీటు మెఱయ, మందులతాయెత్తులతో శబరపుత్రులం గూడియాడు నారాచకోడకాని దొడ్డ మొగంబు కన్నులవిందై పార్వణచంద్రబింబమట్లు కడుంగడు రామణీయకంబున రాణించుచుండె.

ఆనాఁటి దేశీయశైశవవ్యాయామక్రీడ లగు చిల్లపొల్లకాయ, గుడుగుడుగుంచాలు, కుందెనగుడి, గచ్చకాయలు, వెన్నెలకుప్పలు, తన్నుబిల్ల, తూరనతుంకాలు, గీరనగింజలు, బిల్లగోడు, చిడుగుడు, చెండుగట్టినబోది, యుప్పనపట్టె, చిక్కనాబిల్ల, సిరిసింగణావత్తి మున్నగు క్రీడావిహారముల

యందు తండెనంపినఁ దండెవేసినచేయియై బంగారుబాల ప్రాయము వెళ్లఁబుచ్చుచుండె.

అవ్విధంబునఁ దిన్నని బాల్యసంపన్నత యౌవనారంభ సీమకుం బరుగువాఱకముందె విలువిద్దెలయందుఁ బ్రవేశించి వింటిబద్దను బరిగోలలను గయికొని చాపవిద్య సాధించుచు, విల్లు చే సంధించిన నెలవరినాఁగ్గలోని తడవిల్లు వెదురువిల్లు సెలసువిల్లు లోనుగాఁ గలచేఁగపండ్లను సునాయాసంబుగఁ దీసి వేయుచు శరవేగంబునఁ బోవుచువాఱు హరిణంబును ఇచ్చవచ్చినభంగి నింగి వ్రాలుచుఖగంబులను లక్షించి సంహరించు కోదండపాండితీగరిమంబును సంపాదించి నెఱజోఁదను బిరుదు గడియించె.

అట్లు క్రమక్రమంబునఁ దిన్ననికి నవయౌవనం బాసన్నం బగుటయు, బహువిధమృగయావిహారంబుల తెఱంగెఱుకపఱుపవలయు నని యెఱుకులు తమతేఁపకి విన్నపంబు నెఱపిరి. దాని కాళిల్లవల్లభుఁడు వల్లె యని కొండొకశుభ ముహూర్తంబున దనూజాతునిచేఁ గాట్రేనిపూజలు చేయించి నమకట్టి యవ్వార్త పురంబునఁ జాటించుటయు, నెఱుకులు తమయిల్లాండ్రం గూడికొని యుల్లాసంబులు మెఱయ వివిధ సంభారంబులం గొల్లలుగ సంతరించుకొని, వనక్రోడ తామ్ర చూడ మహిషాది నానావిధ జంతుసంహారంబు గావించి మేలిరుచుల దీపించు నంజుళ్లను గావిళ్లం బదిలపఱుచుకొని, తప్పెటలచప్పుళ్లతో, వెట్టిసారకాయబుఱ్ఱలం గట్టిన సరకట్ల

కిన్నరలు మీఁటి మెఱయించు మ్లేచ్ఛసంగీతములతో, గొరగేదకొమ్ములనుండి నిమ్ముగ వెలువడి దిక్తటంబుల ముమ్మరమ్ముగఁ గ్రమ్ముకొని ప్రతిధ్వను లీను వింతవింతరవంబులతో వనస్వామియాలయము చేరుకొనిరి.

అంతఁ గొంతప్రొద్దువఱకుఁ దిన్నఁడు జలకంబులాడి, నొసట విభూతి దాలిచి, రత్నమాణిక్యమాలికలు మేనితోడ పుట్టుగ సలంకరించుకొని, మోముచందురునందము డిందుపఱుప మూఁగియున్న నీలాలకాళికి సానవెట్టెడురీతి లేఁదీఁగం దలకుఁ జుట్టి, విల్లమ్ములు కేలఁ బూని, పితృస్వాంత మువ్వెత్తుగఁ బొంగిపొరలులీల సమీపించిన, నిజనందనునిం గాంచి పుళిందరాజదంపతులు డెంద మలర దీవించి ముద్దాడి వెంట నిడుకొని స్వామిసేవకయి సాఁగిపోయిరి.

అట్లు సమీపించి శరశరాసనాదిదివ్యసాధనములు మృగయాధిదైవతము నెదుటఁ బ్రోగువెట్టించి, రక్తచందనము మేనం బూయించి, నివ్వరిప్రాలపాయసము నైవేద్యంబుగ సమర్పణఁ జేసి, గుగ్గిలంపుఁబొగ ధూపంబు వేయించి, వివిధోపచారములచే సముచితపూజనముల నిర్వర్తింపఁ జేయించి, తిన్ననిచేఁ గ్రన్నన వేఁటలాడం జేసి పుళిందరాజదంపతులు నిజబంధుబృందములం గూడికొని వేడుకమెయి విందులారగింపఁ బూనిరి.

అయ్యవసరంబున మాటలాడఁ దలంచి మఱిపొందువారును, నడవం బోయి కాళ్లు తడఁబడం బడువారును, లేవ

కోదండపాండితీగరిమంబున నొప్పి యొప్పారుం గాక యని దీవనలు వెట్టి యుల్లంబులు సంతసిల్లఁ దమపల్లియకుం బోయిరి. అంత మఱునాఁడు పఱువాతఁ జెంచుతేఁడు బుడుతనికిం దోడుపడఁ దగినవాండ్రం గూరిచి వేఁటలాడువేడుక సాఁగింప నడవికిఁ బుత్తెంచె.

అయ్యవసరంబునఁ జెంచు లెల్లరు దెరచీరకట్టలు, దొడ్డి వలలు, కుందేటివలలు, సవగండవలలు, మకరివలలు మున్నగు వానిని సేకరించుచుకొని వేఁటకుం దిద్దిన జంతుసంతానంబులు వెంటరా విడివేఁటకుం దగినవిహంగములను పాదివేఁటకుం బ్రోదిచేసినపతంగములను భద్రపఱచుకొని సముచితశరశరాసనాదిసాధనంబులతోడం బయలువెడలి మృగకులసంకులం బగు వేంకటాచలంబువంక నిశ్శంకముగ నేగి వేఁటలాడ దొరకొనిరి.

అట్లు వేఁటకుం జనిన తిన్నఁడు పరిజనసముదయముం గూడికొని యాటవికమృగసందోహనిధనంబున నసాధారణ పాటవము చూపుచు, తెరవేఁట, డేగవేఁట, ముంగివేఁట, సివంగివేఁట, యుఱ్ఱివేఁట, ఎద్దువేఁట, మున్నగాఁ గల వేఁటల యెడ నెఱింగి వర్తించుచు బహువిధవిహంగమములు, కురంగపోతములు, కస్తురిపిల్లులు, చమరీమృగంబులు నాదిగాఁ గల మృగరాజిని దండ్రికి నుడుగర లంపి, మున్ను వేఁటపడువునఁ బడి మడిసినమెకముం గొనివచ్చి మిడిగ్రుడ్లు పొడిచి శిరము నీటఁ దడిపి మీనంబు పెకలించి తోఁక గోసి ధూప మిచ్చి

కాత్రినిం గొలిచినయనంతర మింతింతనరాని సంతసమున మదించిన మదపుటేనుంగుగున్నలపోలికఁ జాపట్టునేకలంబులఁ గొన్నిటిం గూలిచి వలలంబులం జిల్చి వెదురుగొట్టంబులం గూర్చి కమర్చియుఁ జము రుట్టిపడం గఱకుట్లు గాల్చియుఁ బుట్టతేనె పెరతేనియలం జేర్చుకొని పొందిక మీఱ విందు లారగించి భూరుహవ్రాతములనీడ పరిశుద్ధశిలాతలప్రదేశములఁ బుష్పపరాగంపుఁ బానుపులపై మేను సేర్చి విశ్రాంతిం గైకొనుచుండె.

అవ్విధంబున వేఁటతమకంబుపెంపునఁ దెంపు లేని విహారంబులం దేలియాడుచు, నవ్వనవీథిం గల మృగసందోహంబుల నెల్లం బరిమార్చి, పక్కిమొత్తంబుల నుక్కుడఁగించి, తత్పరిసరాటవులం గూడ వేఁటలాడ నుత్సహించి పోలియ మొత్తించి, తండెనందనుఁడు ద్రోణాచలసమీపారణ్యప్రదేశముల వసియించుచు సదాశివుకొండ వెండికొండలదండ నుద్దండత వేఁటలాడి యాఖేటఖేలనజనితాయాసవశంబున డస్సి వికచప్రసూనవకుళప్రకరంబులనీడఁ బరుండి నిదురింపఁ దొడంగె.

అత్తఱంగున గాఢనిద్రాముద్రితుం డగు పులిందరాజనందనునకు

మ. ఒడలం జెల్ల విభూతిపూఁత, పులితో లాడాణ, మల్లాడుకెం
జడ, లాత్మైకవిచారనిశ్చలదృగబ్జాతంబు, చెచ్చైన క
చ్చడ, మాంసంబున రుండమాల, గళదేశస్థాణువుం గ్రాలఁగా
నొడయుం డొక్కరుఁ డక్కుమారుకలలో నుద్యత్కృపామూర్తియై.

క. బాలక! యిచట శిలాస్థు
లాలంబునఁ గొండదండ సుంగరేటిదరిన్
శైలసుతాపతి భక్తుల,
పాలిటిపెన్నిధి వసించు భక్తిం గొలుమీ.

అని యానతిచ్చి యంతర్హితుం డగుటయుఁ, బన్నుం డినతిన్నం డదరిపడి లేచి నలుకెలంకులు గలయం జూచుచు నాశ్చర్యరసాన్వితస్వాంతుం డయి వితర్కించుచున్నంత, వలలు పన్ని శార్దూలక్రోడమృగాదులఁ దోలుకొనివచ్చు మృగయుల యూలలు దిక్కులఁ బిక్కటిల్లుచు వానికర్ణపథంబులం బడి తీవ్రప్రబోధంబు గావించుచుండె.

అంత వేటకాఁడు పన్నినయుచ్చులం జిక్కక దొరలఁ ద్రొవ్వం ద్రొక్కి వేటరంగము నిర్గమించి ఘుర్ఘురధ్వనులచే దిక్కుల నుక్కడంచుచు నొక్కయేకలంబు తిన్ననిదృక్పథంబునం బడి కనుమొఱంగుటయు, నతండు ధనుఃకాండములు పాణితలంబున ననుసంధించి దానివెంట నంటె. అయ్యాది వేటకానిగమనవేగమున కోటువడి యలసట జెందినదియుఁ బోలె మందగమనమున తండెనందనుని సమీపంబున నిలుచుచు, నాతఁడు దృష్టి నిగుడించి నారి సారించునంత దూఁటి దాఁటుచు, విలుకాని నాసాసలం ద్రిప్పి పాశవిముక్తుం డగు యోగిక్రియ నిచ్చవచ్చినమచ్చున సంచరించుచుఁ దిన్నఁడు కలలోఁ గన్న శివుని సమీపించునంతవట్టు నడయాడి తటుకున మటుమాయ మయ్యె.

శా. ఇల్లో? ముంగిలియో? యనుంగుఁజెలులో? యీడైనచుట్టంబులో?
యిల్లాలో? కొడుకో? తరింప వశమే యేపోఁడుము ల్లేక? మా
పల్లెం గోరిన వెల్లనుం గలవు తెప్పల్గాఁగ నికిచ్చెదన్
తెల్లంబో! యిట నొంటి నుండ కటు విచ్చేయం గదే లింగమా.

అనుచుం బరిపరివిధంబుల నవ్వరమేశుం గూరిచి ప్రార్థించుచుఁ "బాయసమునకయి నివ్వరిపాలు వెదురుంబ్రాలు నవరపుదొకములపాలుం గలవు. పుట్టతేన పెరతేన తొఱ్ఱతేనె పుట్టజున్ను మున్నగుమధురపదార్థము లారగింపఁ జను. చెంచెతలు తెచ్చి యిచ్చిన పాలపండ్లు బలుసుపండ్లు నేరేడుపండ్లు కొండమామిడిపండు లాదిగాఁ గల ఫలంబు లుపహారంబులు గ స్వీకరించి యిష్టవిహారంబులఁ గూడిమాడి వేడుకలాడవచ్చు. వేగ దయసేయుము. లేకున్న నీయాన, నేను నినుఁ బాసి చనంగ నోవ" నని వేఁడుకొనఁ దొడంగె.

అట వేఁటతమకంబున నొంటిమై యి వరాహంబువెంట నంటి కాననాంతరమునఁ గానరాకుండిన ప్రభుకుమారు నన్వేషించుచు వానియడుగుజాడలఁ దిరుగాడి బోయలు కూయిడుచు సమీపించి 'శివలింగసంగతుం డగు తిన్ననిఁ బ్రసన్నం గాంచి మన్ననల నెఱపి "తోయన్నా! నిన్నుఁ గస్తి గుడిపి యడవిమార్గమునఁ గడు నిడుమలం బడలఁ జేసిన యక్కొల్లమ్ముపంది యెందుఁ బోయె? కన్నీరు మున్నీరు గా వాపోయె దేమిటికి? మమ్ము మన్నించి మాటాడకున్న నీవున్న మాయె; నీగాలి పసివట్టి పట్టెడల బిగఁబట్టినను

నిలువ నోపక నిన్ను జుట్టిముట్టి గునిసియాడు వేఁటకుక్కల నైన మక్కువ మీఱ నాదరింప వేమి! విడివేఁటపిట్టల కింకను మేఁత పెట్ట లేదు; వలలు చిక్కంబు లాదిగాఁ గల వేఁటపరికరంబులు సవరింప లేదు; వందులం బొడిచినపోటుగోలలఁ బెకలింప లేదు; తెగినముకంబులఁ బ్రోగుసేయ లేదు; సారమేయాదులకు మేఁత లిడ లేదు; బలులు సమర్పించి శాక్రని సేవింప నైన లేదు; నేఁటివేఁటముచ్చటలు నీతండ్రి కెఱిఁగింప నింకను బోయలఁ బంప లేదు. ఇత్తెఱంగున డిల్లవడి యుల్లమునఁ దల్లడిల్లమే మొనరించిననేర మేమి? ఓతండ్రీ! నీకలయుదంతము సాంతముగ నెఱింగించి మాజాలి మానిచి యనుగ్రహింపుము. ప్రొద్దు మేఱ మీఱుచున్నది. నిన్నొక్కని నిట డించి పల్లియకుం బోవ మాయుల్లంబు లెట్లోర్చు! నీతల్లిదండ్రులు చెలులు మమ్ముం గాంచి, 'తిన్నం డెచ్చట' నన్న నేమందుము? మమ్మెల్లర నివ్విధంబున నల్లరిపాలు గావింపక వేవేగ పల్లియకుం దయసేయుము. పులిందభూనాథుం డగు నాథనాథునిపున్నెములపంట వయి, మాపల్లియకింత వన్నెయు వాసియుం గూరుచు నెఱజోదు వని నెమ్మనమ్ముల నమ్మియున్నమ మ్ముమ్మలికమ్ముపాలు గావింపక యాత్మావాసమునకు దయసేయు"మని మ్రొక్కి, యెదురుత్తరమీయని తిన్ననిచిత్తవృత్తికిఁ దత్తరపాటు నందుచు నెఱుకులు తమ తేని కీవిధి విన్నవింపఁ గృతనిశ్చయులై తండెనందనుని పాదముల నంటి వనివినియొద మని పెల్లుగ దురపిల్లసాఁగిరి.

అత్తఱి నాళబరరాజనందనుఁడు శివలింగసంగతం బగు నంతరంగమునఁ గృపాపాంగుండై మొగంబునఁ జిఱునగ వంకురింప నవ్వనచరులం గాంచి "తల్లియుఁ దండ్రియుఁ జెలులు నాథుండును నీదైవంబు తప్ప నా కన్యంబు లేదు. మీ రిట్లు దుండుడుకునేఁతల నన్నట్టాఁకలపాలు గావించితి రేని నా వేలుపునకయి ప్రాణంబు లర్పించువాఁడ. నావెంటఁ గరళకంఠుండు వచ్చె నేని మిమ్ముం గూడి నే వైళంబ చనుదెంచువాఁడ. లేకున్న నేనంక నభవుఁ డుండిన నిశ్శంకముగ నే నానంక నుండువాఁడ. మాఱుమాట లుడిగి కారాకూరంబులు చేయక పల్లియలకుం బొం" డని యానతిచ్చి క్రమ్మఱ ముమ్మరమ్ముగ శివపదధ్యాననిమగ్నతం జెలువారు ముగ్ధభక్తుం డగు తిన్ననిం గాంచి వనచరులు విస్మయాకులచిత్తముల నున్మత్తులుం బోలె వెఱ్ఱిచూపులు చూచుచు మనసు ముందునకుఁ బాదములు వెనుకకు నీడ్వఁ గదలిపోయిరి.

అవ్విధంబున నెఱుకమూఁకలు తన్నుఁ బాసి చన్న యనంతరమునఁ దిన్నఁడు కన్నెదుటం బొడకట్టు రాజకళాపునిం గాంచి యెన్నియేండ్లనుండియో మహేశుండు తినఁ దిండి లేక కడు నిడుములఁ గుడుచుచుండ నోపు. కన్నారం గవిన బంటు గలదానికి న్నగులు వావకున్నఁ బ్రయోజనం బే మని తలపోసి సమీపోగ్రాటవుల సంచరించి తొల్లి హరుని కరుణావిశేషంబున వరంబు లంది శ్రీకాళహస్తివిపినస్థలుల మృగయావంబులం దిరుగాడు దైత్యజంతుసంతానంబుల మడి

యించి కాల్చి వ్రేల్చి చవులూరెడు మాంసఖండముల దొప్పలఁ జొప్పడఁ జేసి.

ఉ. వి ల్లొకచంక, నంపపొది వీఁపున, దొప్పలు కేలుదోయి, ను
క్కుల్ల పవిత్రకాంచనముఖీజల మొప్పఁగ నిచ్చి భక్తి రా
జిల్లఁ దదంబుమజ్జనము సేయుచు దొప్పలనంజు దద్రిరా
జిల్లుని నారగింపు మన నాపరమేశ్వరుఁ డూరకుండినన్.

క. కాలవొ! క్రొవ్వవొ! మాఁడెం
గాలెనొ! చవి గావొ! కమ్మ గావో! యిసుక
జాలవొ! యులవడవో! ఉన
నేలా కఱకుట్లు? పార్వతీశ్వర! చెపుమా!

అనుచుఁ బెక్కువిధంబులఁ బ్రార్థించినం దినకున్నఁ బన్నగభూషణుం గాంచి "దేవా! నీ వారగింపకున్న మేనం బ్రాణంబులు నిలుప నేటికి! నీపదరాజీవంబుల ప్రాల నర్పింతు స్వీకరింపవే" యని తిన్నఁడు సాఁగిలంబడి యాక్రందింపఁ దొడంగె.

అవ్విధంబున నివ్వటిల్లు తిన్ననిభక్తిప్రభావంబునకు శివుండు కరంబు హర్షించి సుప్రసన్నుండై యాతనిడెందము నందలికుందు వాపి "యన్నా! కఱకు ట్లారగించెద నె" మ్మని సమ్మతించిన, తండెసంగనుఁడు డెందమున ముదంబంది పులకితగాత్రంబున లేచి నిలిచి హస్తవిన్యస్తమస్తకుం డయి ప్రణతు లొనరించి కఱకు ట్లందిచ్చుచుండ, భక్తవత్సలుం డగు పార్వతీరమణుండు విం దారగించుచుండె. అందుల

కాపుళిందరాజనందనుఁడు మిన్నంది కానలం దిరుగుచుఁ జియ్యఁబట్టిన జంతుసంతానంబును జయ్యనఁ బొలియించుచు మాంసఖండముల వండి ఖండేందుమౌళికిఁ గనువందు వగు విం దొనరించుచుఁ గాల మేగించుచుండె.

అంతఁ గొంతకాలంబునకుఁ దిన్నఁడు క్రన్నన వేఁట లాడఁ బోయినసమయంబున, విభూతిరేఖలు దీర్చిన ఫాల భాగంబును, మూఁపురంబునం బసి చిందులాడు వ్రేలుశిఖయు, గళంబున రుద్రాక్షభూషణంబులును మెఱయ పంచాక్షరీ మంత్రరాజముం జపియించుచుఁ గుండబొజ్జయు గుజ్జురూపుం గల బాడబోత్తముం డొక్కరుం డొకచేతఁ బుష్పకరండం బును వేఱొకచేత సంపూర్ణక్షీరభాండంబును గొని వచ్చి చెచ్చెఱ దేవళంబు సొచ్చి యెంగిలిమంగలంబు లగు దొప్పలం గాంచి చాటికలు వాఱ శివలింగముఁ దిలకించి శివ శివా! యివి యేటిరోఁత! లని యంగలార్చుచు నవ్విధంబున శివ లింగమునకు భంగపా టొదవించినయెంగిలిం గూర్చి శంకించి,

ఉ. ఏసఖుఁడో, సుతుండొ, తరుణీమణియో, నిజసేవకుండొ, ఏ
వో, సకలేశ! శుద్ధ మగుచున్ననిజాలయమీమ రోఁతగాఁ
జేసినవాఁడు? ఏ కొఱుకు సేయ సమర్థు లెవ్వ రీ
దోసము? చెప్పవే కరుణతో మదిఁ దుంపుము కల్లఁ దీఱఁగన్.

ఉ. ప్రేఁతలు మీఁదఁ గప్పినఁ గృపామతి నోర్చితి, ఏచుపొత్తునన్
వ్రాఁతి మొసంగి తిత్తి, మనుభక్తుఁడు కుంటెనఁ బంపఁబోతి, సై
పూఁతి యొనర్చుకొంటి శివభూతిఁ, గపాలమునన్ భుజించి, తీ
రోఁతలు పెక్కు లుండ నిటు రోయుదువే యిఁక భక్తవత్సలా!

క. నీ కిష్టం బిది గాని
నా కాహారార్థుఁ జెప్పినం బదిలక్షల్.
లేకున్న విడుతుఁ బ్రాణము
నీకై కూడుగ్గబట్టి నింగ్రీ నా.

అనుచు నయ్యర్చకుండు దీక్షించి కూరుచుండె.

అక్కాలంబునఁ బ్రాణవియోగంబునకయి కృతనిశ్చయుం డయిన శివగోచరుని యారటంబున కూఱట గల్పింప సంకల్పించి తారాధిపకళాశిఖామణి వానిం గాంచి, "యోగీ! నీ వేల యీలీల జాలివై వాపోయెదవు? అకులితభక్తిశ్రద్ధలతోఁ జెంచొకఁడు శ్రుతివ్యవహారేతరమతమునం గవిలి నన్నుం గొలుచుచున్నవాఁడు. వానిసద్భక్తి కిచ్చ మెచ్చి వాఁడొనరించుసముచితపూజనముల నంగీకరించినాఁడ. భక్తు లెట్టివార లయిన నర్చనావిధానము లెట్టివయిన వారిసునిశిత భక్తితాత్పర్యంబులే ప్రధానంబు లనుట నీ వెఱుంగనిది కాదు. వే యేల! నేఁడు నీవునుం జూచెదవు గాక! వేఁగా దనక నా వెనుకదిక్కున నక్కియుండు, మాతఁ డరుగుదెంచు కాల మయ్యె" నని యానతిచ్చుటయు, నాహారద్విజుండు మాఱుమాట లుడిగి యాస్వామిపజ్జ నొదిఁగి వానిరాక నిరీక్షించుచుండె.

అనంతర మాశబరభూకాంతనందనుం డాపొంతఁ గాంతారముల నెల్ల నుల్ల మెలిమిఁ గ్రుమ్మర సంపాదించిన యామిషంబుల నెత్తిఁ బెట్టుకొని వచ్చి యతిరయంబున గుడి

సవిశేషించి తన దివ్యాంగాలఁ బావననిర్మాల్యంబు పోవం ద్రోచి పుక్కిటం బట్టిన కాంచనముఖిజలంబులచే వెక్కసంబుగ నక్కపర్దికి మజ్జనంబు గావించి యెప్పటిచొప్పున కోలాదిమఖండముల నోటి కందిచ్చిన శివుండు భక్షింపఁ డయ్యె.

అక్కతంబున ముక్కంటి పలాశనాసక్తుండు గాకుంటకుఁ గర్జంబు గానక పుళిందరాజనందనుఁడు డోలాందోళితహృదయుం డయి డిల్లవడి చూచుచుండునంత, శూలికనుఁదమ్మిఁ గ్రమ్మి పొటపొట కన్నీరు గాఱ సాగె. దానిం గాంచి తిన్నఁ డెన్నఁ డెఱుంగనియులమటం గుందుచు నంతరంగము దుఃఖతరంగితం బగుడు, నగ్గజదనుజాంతకునినేత్రరోగమునకు వలయుచికిత్సం గోరి యాలింగముకంటిలో నెరుసు లేదు గదా యని యూఁదుచు నాలుకం జాచి కనుగ్రుడ్డుపై నివురుచుఁ జేరిననెయి వెట్టి పెరుఁగువత్తులు వయిచి తెల్లదించెనపూరనంబు పిండి వివిధోపచారంబులు గావించియు, మనోరథసిద్ధి గాంచ నేరక యూరక పరిదేవనము సేయుచుఁ గొండొకవడికి నేద దేఱి నిటలాక్షుని వీక్షించి యిట్లని వితర్కింపఁ దొడంగె.

“ఇయ్యవి యానందబాష్పబిందుసందోహము లని సందేహింతునా! మోమున హర్షచిహ్నములు చూపట్టవు. కరుణార్ద్రవీక్షణవారి యందునా? శీతలతోయకణంబులు కావరా వయ్యె. ఘర్మజలాసారవార మని శంకింతునా? అయ్యది కన్నులఁ బొడము టసంభవము. శోకపూరితహృదయులకుఁగా నుందునా! కనుఱెంట నశ్రువులు కావరా వయ్యె.

నిందను విని గౌరి నీ రైననాఁడు గాని, జనకునిచే బంధనుని బ్రుందింపఁజేసిననాఁడు గాని, ఱాలు రువ్వినవ్వాఁడేని గాని, మన్ను మోయువేళఁ గాని కన్నుల నీ రెఱుంగఁడు. నేఁ డేదియో నిశ్చయముగఁ గంటికి రోగము దాపురింప నోపు. అయ్యది కోడిరెప్పవిధము, పువ్వుగంటిపోటా, తటిగన్నా, మూదరమో తెలియంగరాదు. మాయురే! కంటిమంటచేఁ గామునిపీచ మడంచిన ముక్కంటికంటివార్త నాలించి లేని వైరివీరులు క్రిగంట నవ్వరే? సురవరులు నిన్ను లోకం బయిన చీకింగొందురే?" యని వెక్కివెక్కి యేడువం దొడంగె.

మఱియు నాకిరాతరాజతనూజుండు శంకరుని గవుంగిలించి బిగ్గఁ బొదివి పట్టి నేత్రోదకమ్ము రొమ్మునఁ గుమ్ముచుఁ "బుత్రుండ నేను నీదండ నుండ నవ్వాల మునుగంగ నేటికి? శివా!" యనుచుఁ బరిపరివిధములఁ బరిదేవనము సేయుచు మగుడఁ గన్ను తెన్నరయఁ గోరి శివనేత్రమును శోధించు నెడఁ గనుఁగొల్కినుండి నెత్తురు జాలువాఱ సాగె. దానిం గాంచి చెంచురాసుతుఁడు "మాటిమాటికి నేఁ జేసిన మందులెల్ల వెల్లిఁ గలిపినచింతపండును, నీట వ్రాసినవ్రాలు నై వమ్ముయిపోయిన పోవుఁ గాక! కీలాలము రాల నేల? హా! జగన్నాథ! నాతండ్రీ! నే నేమి సేయువాఁడ? కన్నమందులు విన్నమందులు కంటినెగులు తీర్పవాయె. నే మందులకు బుట్టంగనివాఁడ. కానిమ్ము చూచెదం గాక! కంటికిఁ గంటి

కంటె వేఱొకమందు గలదే!" యనుచుఁ దిన్నఁడు ముక్కంటి సన్నిధిని నిలిచి,

ఉ. ప్రాణము పోవుఁగాక తనువు భంగము నొందుఁగాక, తూణికా
బాణము జిఱ్ఱునం దిగిచి భల్లముఖాగ్రము రక్తపద్మపు
కోణముఁ జేర్చి త్రచ్చి యొకగ్రుడ్డు వడిం బెకలించి శోణిత
స్రోత మదైన దైవతశిరోమణికంట నమర్చె నంతటన్.

అట్లు తిన్నండు తనకన్ను పెకలించి పన్నగభూషణు నేత్రమున కతికించుటయు, వైళంబ బొమ్మవారి నివారితం బయ్యె.

కాని యించుకతడవులో మగుడ రెండవకంట శోణిత బిందువులు వెడలఁ దొడంగె. అందుల కాపులిందుఁడు మందహాసం బొనరించి కన్నమం దుండఁగా గుండ నేటికి? శివా! యని నొడువుచు లలాటలోచనమునఁ గీలాలము జాలువాఱ నేని ప్రాణములు బలిపెట్టువాఁడ నని తలంచుచుఁ, జెప్పుఁగాల నిటలాక్షునిదృష్టిమూలంబునఁ దన్ని పట్టి వాడి బాణంబున రెండవగ్రుడ్డు పెకలింప నుంకించుచుఁ, శీతమహీధర కన్యకా ముద్దుచేలు తనచేలఁ గీలించి మునులు దిక్పాలకులాదిగఁ గల వియచ్చరగణంబులు బలసి కొలువ మృత్యుంజయుండు తం డెవం డనుచు మ్రోలఁ బ్రత్యక్షం బయి నిలువు నిలువు మను గంభీరనినాదంబులు దిక్కులు పిక్కటిల్ల నాకసంబున నేఁ డంటి తన మ్రోల వ్రాఁగియున్న భక్తు నుద్దేశించి "శివ గోచర! యిమ్మహాభక్తావతంసుని మహిమాతిశయంబులు

సాంతముగఁ దిలకించితివే! నన్నుభక్తుం జేఁత నప్పు జని యిపు డయిన నంగీకరింతువా? నీమనోవైకల్యము మానిపోయెనే? ఈ కొంచుభక్తునికై కైంకర్యము నీయిచ్చకు వచ్చి కొం చొప్పెడఁ గూర్పవే!" యని హెచ్చరించి భక్తుల నిర్వురను జెరి యొక్కప్రక్కకుఁ జేరఁ దిగిచి "మీ కోరియుత్తమవరంబు లనుగ్రాహ్యంబులు చెప్పుఁడు" డని యానతిచ్చె.

అంత నాశైవద్విజుం డభవునిదిక్కు మొగం బయి "స్వామీ! యీతఁడు కిరాతుండు. ఏనో దుర్మదాంధుండ. అట్లగుట మే మెట్లు వరంబులు కోర నేరుతుము? అయినను

చ. జగములు నంతరాత్మయును సాక్షియు నీ వనుచు న్నిజంబుగా
నిగమము లాడఁగా వినియు నేఁ డితరంబుగ మాకభీప్సితం
బగు వర మెట్లు వేఁడఁగల మయ్య? భవన్మయ మైన పూర్ణచి
ద్గగనములో మముం గలిపి క్రమ్మఱఁ బుట్టువుబాధ మాన్పవే."

అని భక్తు లిర్వురును సాష్టాంగప్రణామంబు లీశున కర్పించి తద్వ్యమలతేజోధ్యాననిర్మగ్నభావు లయి నిలిచిన నాథవుండు భక్తపుంగవులభవబంధములు వదలించి యనంతం బగు నాత్మరూపమునం గూర్చి యంతర్హితుం డయ్యె.

తొల్లి దివిజేశతనూభవుండు పాశుపతంబుఁ బడయం గోరి యింద్రకీలశైలంబున నుగ్రతపం బొనరించువేళఁ బ్రమథగణంబు లెఱుక లయి తన్ను సేవింప, నద్రిరాజతనయ చెంచెతయై వెంట నంటి రా, నాల్గువేదములు జాగిలంబు లయి ముందు సాగి నడుప, భర్గుండు కిరాతరూపమునఁ గిటిరూప

ధరుం డగు మూకాసురుని దరుమఁగొని వచ్చె. అంత నర హరులకుఁ గయ్యము పొసంగె. అందు ధనంజయుండు పురభేదిని జిరికిం గొనక ప్రతాపంబు చూపుచుండ, మహేశుండు నిజమహిమాతిరేకంబునఁ గిరీటియక్షయతూణీరంబుల నంబకముల మటుమాయం బొనరించె. దాన నుడుగక భీభత్సుండు మల్లయుద్ధచాకచక్యంబు కనఁబఱుపం గడంగె.

ఇట్లు రుద్రార్జును లుద్రేకించి వివిధభంగులఁ దాండవం బాడునట్లు యుద్ధకౌశలంబులు చూపుచుఁ బెనంగునప్పుడు మదమాతంగము సింధురార్భకముతో సంధించి క్రీడించువడువున న్నెదిర్చి పోరు భీభత్సునిమాత్సర్యంబున కిచ్చ మెచ్చి శాశోదరభూషణుండు సుప్రసన్నుండై సాక్షాత్కరించె. తన్మూర్తిం గాంచి పాండునందనుఁడు పరవశంబున సాఁగిలంబడి మదీయాజ్ఞానసంజనితాపరాధంబు సైరింపవే యని ప్రార్థించి యనంతరము పాశుపతమంత్రరాజంబును ముక్తికాంతాకరగ్రహణమహాభాగ్యంబును బ్రసాదింపవే యని కపర్ది నర్థించె.

అందుల కానాగచర్మవసనుండు దయావీక్షణంబులఁ బార్థునిం గాంచి "వత్సా! నీతపోనియమంబు కరంబు ముదావహం బయ్యె, ఇయ్యది పాశుపతాస్త్రంబు సమంత్రకంబుగా ననుగ్రహించితి. వెండియు బంధుహననపాతకంబునం జేసి సాయుజ్యసామ్రాజ్యసంపద నీపుట్టువునఁ జేపట్టఁ జాలవు. కాంతు చేసితివి కావునఁ గలియుగంబున మృగహంత వంశ

పుట్టి శైలాటవుల వేటనెపంబునఁ దిరుగాడుచు [illegible]ద్రాం శమగు లింగమును గాంచి సేవించి కామితంబు సఫలీకూర్చు కొందు" వని యానతిచ్చి తిరోహితుం డయ్యె.

దానం జేసి వెన్నునిచెలిమికాఁ డగు ఫల్గునుఁడు తండెమందగామిని నోచిననోములపంటయు నాథనాథభూనాథుని భాగధేయము నై యుదయించి, వేఁటతమకంబున ఘోరాటవులఁ గ్రుమ్మరి నిటలాక్షుని దర్శించి సంప్రీతిమెయిం బూజించి యీశ్వరకృతపరీక్షావసరమునఁ గన్నొసంగినవాఁ డగుటం జేసి 'కన్నప్ప' యను నన్వర్థాభిధేయంబు వహించి చిరయశంబు గాంచి మించె.

నేఁటికిని శ్రీకాళహస్తిపుణ్యక్షేత్రమును సందర్శించు తైర్థికు లాపురాతనదేవళంబు సొంపున కక్కజ మందుదురు. దాని కనతిదూరంబున నున్న భరద్వాజాశ్రమస్థానమునందలి పుష్కరిణీపరిసరమున నెలకొనియున్న శాంతిసామ్రాజ్యము నకుఁ బట్టభద్రు లగుటకై యుత్తలూఁగుచుందురు.

తదీయాశ్రమోపాంతమార్గంబులం బట్టి కొంతద వ్వేగిన తిన్ననికైవల్యస్థానం బగు కైలాసపర్వతశ్రేణి కనువిం దొనర్చు. మఱియుఁ గవివతంసుల తదీయవిభవవర్ణనలు కల్లలు గా వని పరిశోధకులయెదుట సాక్ష్య మిచ్చుటకో యన నిలిచి యున్న సనాతనశిథిలచిహ్నములు పెక్కు లందుఁ గలవు. సుచరిత్రాభిలాషు లగు పాఠకులు సుప్రసిద్ధతీర్థసంసేవనమునఁ గాని భారతజాతీయజీవితపరమార్థమును సంగ్రహింపఁ జాలరు.

తిన్నని బత్తి తెన్నులం గన్నవారికి విన్నవారికి నమ్మహా దేవుననుగ్రహంబున సకలార్థములు సమకూడి యాయుర్భాగ్యము, లవ్వారిగ సిద్ధించుఁ గాక!

ఇతి శ్రీమద్భరద్వాజగోత్ర పవిత్రచరిత్ర బాలదారివంశ
పయఃపారావార రాకాసుధాకర రామదేవ కాంత
మాంగళ్య గర్భశుక్తిముక్తాఫల వాగ్దేవీప్రసాదా
సాదిత సంస్కృత వాగ్ధాటీప్రగల్భవక్తృత్వవిశారద
గాంభీర్య దాక్షిణ్యధామ విష్ణుకటకాధీశలబ్ధ
హేమఘంటాంకిత కంకణ విరాజమాన
పార్వతీరమణ చరణసేవాధురీణ
విబుధసంసేవ్యమాన వీర
నారాయణదేవ ప్రణీతం
బగు ‘ఉత్తమజీవితం’
బను గ్రంథంబు

సంపూర్ణము

